Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)
స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు    స్థాపితం: 1930    జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 37 • 7-9-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



## వెయ్యి తలల విషనాగులా విశ్వరూపం దాల్చిన

# నెల్లూరు ఇసుక మాఫియా!

నలభై ఏళ్ల క్రితం మన దేశంలో అత్యంత లాభదాయకమైన అక్రమ వ్యాపారం – బంగారం స్మగ్లింగ్. హాజీ మస్తాన్, యూసఫ్ పటేల్ వంటి అంతర్జాతీయ స్మగ్లర్లు దానితోనే ప్రఖ్యాతి చెందారు. కానీ ఇప్పుడు నెల్లూరులో ఇసుక స్మగ్లింగ్ ద్వారా మన ఎమ్మెల్యేలు, మంత్రిగారు సంపాదిస్తున్న సొమ్ము చూస్తుంటే కళ్లు తిరుగుతున్నాయి. అది సంపాదన కాదు, నోట్లు అచ్చువేసుకొని, కట్టలు కట్టుకోవడంతో సమానంగా వుంది.

## మాఫియా కింగ్ కోడూరుపాడు పరమేశ్వర్‌రెడ్డి?

జిల్లాలో జరుగుతున్న ఇసుక దొంగ రవాణాకు కీలక సూత్రధారి కోడూరుపాడుకు చెందిన పరమేశ్వరరెడ్డి అనే కాంగ్రెస్ వాది అని తెలుస్తున్నది. అధికారికంగా నడుస్తున్న కోటితీర్థం, తూర్పుకంభంపాడు, ముదివర్తి రేవులకు సంబంధించిన మైనింగ్ పర్మిట్లు మొత్తం ఆయన చేతిలోనే వున్నాయట. వేలం పాడుకొన్న వారంతా ఆయన దగ్గర అవసరం మేరకు తీసుకోవాలి. అధికారికంగా నడిచే తతిమా రేవులలో రవాణాదారుల నుంచి మామూలు దండే బాధ్యత కూడా ఆయనదే అని చెప్తున్నారు. ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి తన ప్రతినిధిగా పరమేశ్వరరెడ్డిని నియమించుకొన్నాడని వినికిడి. నెలకు దాదాపు యాభై కోట్ల రూపాయల సొత్తు ఆయన వద్దకు చేరుతున్నదని, వేలం పాడుకొన్న వారికి, అధికారులకు, ఎమ్మెల్యే గారికి ఆయనే లెక్క చూసి నెల నెలా ఎవరి వాటాలు వారికి పంచుతున్నారని చెప్తున్నారు. ఇవన్నీ అనధికారికంగా తెలిసే వార్తలు మాత్రమే. రుజువులు, సాక్ష్యాలు వుండవు. అందరికీ నిజాలు తెలుసు. కానీ ఎవరూ ఏమీ తెలియనట్లే చూస్తూ వుండిపోతారు. మాఫియా వ్యాపారాల తీరే అంత.

పెన్నా నదిలో ఇసుక త్రవ్వకానికి చాలా రేవులున్నాయి. తూర్పు కంభంపాడు, కోటితీర్థం, ములుమూడి, జొన్నవాడ, పొట్టేపాళెం, ముదివర్తి, ముదివర్తిపాళెం, పోతిరెడ్డిపాళెం, దామరమడుగు, మినగల్లు, దువ్వూరు, సంగం... ఇట్లా దాదాపు పాతిక ముప్పై చోట్ల పెన్నా ఇసుక త్రవ్వుకొనే అవకాశం వుంది. గతంలో వీటన్నిటికీ మైనింగ్ అధికారుల అనుమతులుండేవి. వేలం పాటలు జరిగేవి. ప్రభుత్వానికి రూపాయి కట్టి వేలం పాడుకొన్న వాళ్లు పది రూపాయలు సంపాదించుకొనే వారు. కానీ హైకోర్టు కేసులు, నియంత్రణల తర్వాత పరిస్థితి మారిపోయింది. ఎక్కడంటే అక్కడ ఇసుక త్రవ్వరాదని హైకోర్టు స్పష్టంగా ఆదేశించడంతో, పర్యావరణ పరిరక్షణకు ప్రాధాన్యత ఇవ్వాలని నియమం విధించడంతో వేలం పాటల విషయంలో ప్రభుత్వం అయోమయానికి లోనైంది. ఒక స్పష్టమైన నిర్ణయానికి రాలేక పోతున్నది. వేలం పాటలు నిర్వహించలేక పోతున్నది. దానికి తోడు అధికార పార్టీ ఎమ్మెల్యేలు, మంత్రులు ఈ వ్యాపారంలో వేలు పెట్టారు. తిరుమల వెంకన్న హుండీలో వలె రోజూ కోట్ల రూపాయలు ధారాపాతంగా వచ్చి పడే అవకాశం కళ్ల ముందు కన్పిస్తుండడంతో ఇసుక వ్యవహారం మొత్తాన్ని జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి తమ చేతులలోకి తీసుకొన్నారు. ఒక మాఫియా సామ్రాజ్యం సృష్టించారు.

ఇప్పుడు నెల్లూరు జిల్లాలో కేవలం ముదివర్తి, కోటితీర్థం, మినగల్లు, తూర్పుకంభంపాడు రీచ్‌లలో మాత్రమే ఇసుక త్రవ్వకానికి అనుమతి వుంది. వీటికి జూలై నెలలో అదనపు జాయింట్ కలెక్టర్ వేలం నిర్వహిస్తే, వివేకానందరెడ్డి ఆధ్వర్యంలో కాంట్రాక్టర్లు కుమ్మక్కై, రూట్ మ్యాప్ ఇవ్వాలని షరతు పెట్టి, అధికారులను అయోమయంలోకి నెట్టి, వేలం జరగకుండా అడ్డుకొన్నారు. ఆ తర్వాత ఎట్నో తంటాలు పడి ఆగష్టు నెలలో వేలం జరిపించారు. ఎమ్మెల్యే గారి రౌడీయిజం తెలిసిన వ్యాపారులు, ఆయనకు ఎదురు వెళ్తే, ఒక్క బండి ఇసుక త్రవ్వుకోలేమని అర్థం చేసుకొని, అన్ని రీచ్‌లలో ఎమ్మెల్యే సంబంధీకులకే అప్ప చెప్పి, అందులో తలా కొంత వాటా తీసుకొని, వేలం ధరలు పెరగకుండా చూశారు. కోటితీర్థానికి 3 కోట్ల ఇరవై లక్షలు, తూర్పుకంభంపాడుకు 4 కోట్లా 80 లక్షల ధర మాత్రమే పలికింది వేలంలో. ఆ రెండు రీచ్‌లకు మాత్రం వేలం షరతుల ప్రకారం 25శాతం ధరావత్తు చెల్లించారు. అయితే ఇదే సమయంలో జరిగిన మినగల్లు రీచ్‌కు 7 కోట్ల పైన ధర పలకడంతో, దానికి ధరావత్తు చెల్లించలేదు.

లెక్క ప్రకారం, ముదివర్తి, కంభంపాడు రీచ్‌లలో మాత్రమే ఇసుక త్రవ్వకం జరగాలి. మైనింగ్ శాఖ ఈ రెండు చోట్ల మాత్రమే రాయల్టీ పత్రాలు


పెన్నానదిలో లోతు గుంటలు పెట్టి మరీ ఇసుకను లోడేస్తున్నారు.

ఇస్తుంది. కానీ జిల్లాలోని మొత్తం 28 రేవులలో ఇసుక త్రవ్వకాలు యదేచ్ఛగా జరిగిపోతున్నాయి. హైకోర్టు విధించిన ప్రధాన నియమం – ఇసుక త్రవ్వకానికి యంత్రాలు వాడకూడదని. కానీ అనుమతి వున్న వాటిలో, లేని వాటిలో కూడా వందలాది యంత్రాలు ఇసుకను త్రవ్వి పారేస్తున్నాయి. ఎట్టి పరిస్థితులలోనూ 3 అడుగులకు మించి లోతు త్రవ్వకూడదన్నది ఆంక్ష. కానీ పొట్టేపాళెం, పోతిరెడ్డిపాళెం వంటి చోట్ల అరవై డెబ్బై అడుగులు లోతు గుంటలు పెట్టి మరీ ఇసుక తరలిస్తున్నారు.

హైకోర్టు ఆంక్షల వల్ల ఇసుకకు ఎక్కడలేని గిరాకీ వచ్చింది. ఒక్క మన జిల్లాలోనే కాదు, పొరుగునే వున్న ఒంగోలు, చిత్తూరు జిల్లాలలోను. పక్క రాష్ట్రమైన తమిళనాడులోనూ ఇసుక దొరకడం గగనంగా వుంది. దానితో ఇసుక ధర బంగారంతో పోటీ పడుతున్నది.

నెల్లూరు నగరంలో కొంటే – ట్రాక్టర్ ఇసుక ధర నాలుగు వేలు. మామూలు లారీ అయితే 20వేలు. అదే పెద్ద ట్రక్కులైతే 40వేల రూపాయలు. పెన్న ఒడ్డున వున్న గ్రామాల వారికి ఈ ధరలు చూస్తే వూట బావుల్లో వలె నోట్లో నీళ్లు వూరి పోతున్నాయి. ఇసుక వ్యాపారంతో ఏ సంబంధం లేని వారు కూడా ఇందులోకి ఒక ప్రవాహం వలె తరలి వస్తున్నారు. పొట్టేపాళెం, జొన్నవాడ, మినగల్లు, దువ్వూరు, ములుమూడి, పోతిరెడ్డిపాళెం వంటి గ్రామాలలో వూరికి నూటయాభై నుంచి రెండు వందల వరకు ట్రాక్టర్లు ఇసుక రవాణాలోకి దిగిపోయి వున్నాయి. గ్రామాలలోని కూలీ జనం, చిన్న చిన్న కుటుంబాల వారు కూడా తమ దగ్గర ట్రాక్టర్ లేకుంటే ఇతరత్రా బంధువుల నుంచి బాడుగకు తెచ్చుకొని మరీ ఇసుక రవాణా చేస్తున్నారు. ఒక్క ట్రాక్టర్ వుంటే, నెలకు రెండు నుండి మూడు లక్షల రూపాయల వ్యాపారం నడుపుకొనే వీలుండడంతో ఆయా గ్రామాలలో ఇసుక రవాణా ఒక వేలం వెర్రిగా నడుస్తున్నది.

కొరవ 8వ పేజీలో

## దొంగకు తాళం

జిల్లాలో ఇసుక స్మగ్లింగ్ సమస్తం ఆనం కుటుంబం కనుసన్నలలో నడుస్తున్నదన్న నిజం అందరికీ తెలుసు. ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి దృష్టికి కూడా వెళ్లిందా విషయం. కానీ విచిత్రంగా రాష్ట్రంలో ఇసుక మాఫియా అక్రమాలకు అడ్డుకట్ట వేయడమెట్లా అనే పరిశీలన జరపడానికి ముఖ్యమంత్రి ఒక మంత్రుల ఉపసంఘాన్ని నియమించాడు. అందులో ఆనం రామనారాయణరెడ్డి ఒక సభ్యుడు. మాఫియా వ్యాపారాలను నడిపే మంత్రికే మాఫియా నియంత్రణ బాధ్యత అప్పచెప్పడం, దొంగ చేతికి తాళం ఇచ్చినట్లుంది. ముఖ్యమంత్రి ఆ మాత్రం ఆలోచన చేయలేని వాడా?

# రిజర్వేషన్ల కార్చిచ్చు

రిజర్వేషన్ల వివాదం ఈ వారంలో రెండు వేదికల మీద భగ్గున మండింది. మొదటిది – ఎస్సీ కులాలు, ఎస్టీ తెగలకు చెందిన ప్రభుత్వ ఉద్యోగులకు ప్రమోషన్లలో కూడా రిజర్వేషన్ల నియమం వర్తింప చేయాలని యూపిఏ ప్రభుత్వం తీసుకొన్న నిర్ణయం. రెండవది–స్థానిక సంస్థల ఎన్నికలలో మొత్తం రిజర్వేషన్లు 50 శాతాన్ని దాటకూడదని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు చెప్పిన తీర్పు.

మొదటి దాని విషయంలో యుపిఏ రాజకీయ ప్రయోజనాలు దాగి వున్నాయి. బొగ్గు గనుల కుంభకోణంలో అవినీతి మసి అంటిన ప్రధాన మంత్రి గద్దె దిగాలని ప్రతిపక్షాలు పార్లమెంట్‌లో చేస్తున్న అల్లరిని ఆపు చేయడానికి కాంగ్రెస్ పార్టీ దీని ద్వారా ఒక బలహీన ప్రయత్నం చేస్తున్నది. మరొక ప్రక్క ఉత్తరాది రాష్ట్రాలలో తమ ఓటు బ్యాంకు నుంచి వలస పోయిన ఎస్సీ కులాల వారిని తిరిగి రాబట్టుకోవడానికి కాంగ్రెస్ నేతలు వేసిన పథకం కూడా దీని వెనుక దాగి వుంది. ప్రభుత్వ ఉద్యోగాలు, విద్యాసంస్థలలో ఈ రెండు వర్గాల ప్రజలకు రిజర్వేషన్లు కల్పించిన మహానుభావుడు డాక్టర్ బిఆర్.అంబేద్కర్. తరతరాలుగా సవర్ణుల అణిచివేతకు బలైపోయిన అణగారిన వర్గాల వారికి సామాజిక న్యాయం కల్పించడానికి అంబేద్కర్ ఎన్నుకొన్న మార్గమది. రిజర్వేషన్ల వల్ల విద్య, ఉద్యోగ అవకాశాలలో అనర్హులకు అందలం లభించి, అర్హులైన వారు నిరాదరణకు గురౌతారనే అభ్యంతరం ఆనాడే తలెత్తినా, జవహర్‌లాల్ నెహ్రూ వంటి జాతి నిర్మాతలకు దీనిపట్ల అసంతృప్తి వున్నా, అణగారిన దళితుల జీవితాలు ఎరిగినవారు కాబట్టి, అంబేద్కర్ వాదన కాదనలేక, అయిష్టంగానే అంగీకరించారు. అయితే పాతికేళ్లపాటు ఈ పద్ధతి పాటిస్తే, సమాజంలో దళితులకు, అగ్రవర్ణాలకు మధ్య ఆర్థిక, సామాజిక అంతరాలు తొలగిపోతాయని ఆశించారు వారు. కానీ స్వాతంత్ర్యం వచ్చి 65ఏళ్లు గడిచిన తర్వాత కూడా దళితుల పట్ల సామాజిక వివక్ష సజీవంగా కొనసాగడం దురదృష్టకరం. తమిళనాడులో ఇటీవల జరిగిన ఒక సంఘటన అందుకొక నిదర్శనం. పాఠశాలలో తమ పిల్లలు తినే మధ్యాహ్న భోజనం దళిత మహిళ వండుతున్నదన్న ఆగ్రహంతో ఒక గ్రామంలోని వన్నియార్ల కులస్తులు పాఠశాలనే బహిష్కరించారు. దళితుల పట్ల సవర్ణులలో వివక్ష ఎంత బలీయంగా నాటుకొని పోయి వుందో దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. అందువల్లనే అంబేద్కర్ ఆనాడు రిజర్వేషన్ల కాల పరిమితి 25 ఏళ్లుగా నిర్ణయించినా, తదుపరి ప్రభుత్వాలు వాటిని ఇప్పటికీ కొనసాగిస్తున్నాయి.. ఈ నేపథ్యంలో ప్రభుత్వ ఉద్యోగాలకు కూడా ప్రమోషన్లు వర్తింప చేయాలని మన్మోహన్‌సింగ్ నిర్ణయించడం తప్పేమీ కాదు. అయితే రిజర్వేషన్ల మౌలిక లక్ష్యం – సామాజిక వెనుకబాటుతనం వల్ల సమాన అవకాశాలు పొందలేని వారికి అవకాశం కల్పించడమే. కానీ ఒకసారి ఉద్యోగంలో చేరిన తర్వాత పదోన్నతికి కూడా కులాన్ని వాడుకోవడం వల్ల ప్రభుత్వ యంత్రాంగంలో, పరిపాలనలో చాలా అనర్థాలు జరుగుతాయి. జూనియర్ల క్రింద సీనియర్లు పని చేయవలసి వస్తుంది. సరైన అనుభవం లేని వారి చేతిలోకి బాధ్యతాయుతమైన అధికారాలు వెళ్తాయి. దానివల్ల పరిపాలన కుంటుపడుతుంది. ఉత్తరప్రదేశ్‌లో మాయావతి సర్కారు ఇది వరకు ఇదే రిజర్వేషన్ల నిర్ణయం తీసుకొంటే, ఇదే అభ్యంతరాలతో ఆ రాష్ట్ర హైకోర్టు దాన్ని కొట్టివేసింది. రాజ్యాంగ విరుద్ధమని తీర్పు చెప్పింది. సుప్రీంకోర్టు కూడా పలు సందర్భాలలో అదే భావన వ్యక్తం చేసింది. ఇవన్నీ తెలిసి కూడా మన్మోహన్‌సింగ్ ఈ నిర్ణయం తీసుకోవడం వెనుక ఎస్సీ, ఎస్టీ కులాలలో ఓటు బ్యాంకు సృష్టించుకోవాలన్న రాజకీయ స్వార్థం తప్ప వేరొక కారణం కన్పించదు.

మన రాష్ట్రంలో స్థానిక సంస్థల ఎన్నికలలో రిజర్వేషన్ల పరిమితి 50 శాతం దాటరాదని హైకోర్టు ఇచ్చిన తీర్పు వల్ల వెనుకబడిన తరగతుల వారి అవకాశాలు చేజారుతాయి. ఇప్పటి వరకు వారికి 33 శాతం రిజర్వేషన్ వుంది. అది 22 శాతానికి పడిపోతుంది. బిసి కులాలలో దీనిపట్ల తీవ్ర అసంతృప్తి, వ్యతిరేకత వ్యక్తం కావడం సహజం. దాని ప్రభావం రాష్ట్ర రాజకీయాలపై ఎంతో గట్టిగానే వుండబోతుంది. అయితే ఇటువంటి సవాళ్లను సమయస్ఫూర్తితో పరిష్కరించుకోగల సమర్థత మన ముఖ్యమంత్రికి లేదు. దానితో ఈ తీర్పు వల్ల అసలు స్థానిక సంస్థలకు ఎన్నికలే నిలిచిపోతాయి. ఏది ఏమైనా రిజర్వేషన్ల సమస్య ఒక కార్చిచ్చు వంటిది. దాన్ని ఒకసారి వెలిగిస్తే ఆర్పే సామర్థ్యం ఎవరికీ వుండదు. వి.పి.సింగ్ హయాంలో జరిగిన మండల్ నివేదిక అమలు అందుకొక ఉదాహరణ. అందువల్ల రాజకీయ స్వార్థంతో, తాత్కాలిక ప్రయోజనాల కోసం ఈ దావానలాన్ని సృష్టించాలనుకోవడం దేశానికి హితవు కాదు. ప్రధాని, కాంగ్రెస్ పార్టీ ఆ నిజం గుర్తుంచుకొని మసలితే ప్రజల మధ్య శాంతి, సోదర భావాలు దెబ్బతినకుండా వుంటాయి. లేకుంటే సామాజిక అశాంతికి అగ్గి రాజేసిన వారౌతారు.

జమీన్‌రైతు

## జనవాణి

### మంచి నిర్ణయం

నెల్లూరు జిల్లా రెడ్‌క్రాస్ జీవితసభ్యుల సర్వసభ్య సమావేశం, కార్యవర్గ ఎన్నికలు వాయిదా పడినట్లు కలెక్టర్ శ్రీధర్‌రెడ్డిగారు పత్రికా ప్రకటన చేయడం హర్షణీయం. కార్యవర్గ ఎన్నికలనగానే 15మంది ఒక ప్యానల్‌గా ఏర్పడి నామినేషన్ వేశారు. వీరిలో ఎక్కువమంది గతంలో సంస్థను నానా రకాలుగా భ్రష్టు పట్టించిన వారే వున్నారు. ఏకగ్రీవంగా ఎన్నికయ్యేందుకు వీరు పన్నిన పన్నాగాన్ని గ్రహించి నేను ఒంటరిగా నామినేషన్ వేశాను. ఎన్నికల అధికారి అయిన నెల్లూరు ఆర్డీఓ మాధవీలత ఈ విషయమై కలెక్టరు, జాయింట్ కలెక్టర్‌తో మాట్లాడగా వారు రాష్ట్ర రెడ్‌క్రాస్ కార్యదర్శి సూచలన మేరకు ఎన్నికలు వాయిదా వేయడం అధర్మం మీద ధర్మం గెలిచినట్లు భావిస్తున్నాను. భవిష్యత్తులో జరుగబోయే ఎన్నికల్లో ప్రజాస్వామ్య పద్ధతిలో జీవితకాల సభ్యులు ఎవరైనా పోటీలో పాల్గొనే అర్హత కల్పించవలసినదిగా జిల్లా అధికారులను కోరుతున్నాను.

మోడెం కోటారెడ్డి — పడుగుపాడు

### జడ్జీలు దేశాన్ని పాలించరాదనడం తగదు!

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అవినీతి ఊబిలో కూరకపోయాయి. కేంద్ర మంత్రులు, రాష్ట్రమంత్రులు ఎవరిపాటికి వాళ్లు ప్రజాధనాన్ని లూటీ చేసేస్తున్నారు. సుప్రీంకోర్టు జోక్యం చేసుకోవడంతో 2జిస్పెక్ట్రం కుంభకోణంలో నిందితులు కేంద్రమంత్రి రాజా, ఎమ్పీ కనిమొళి జైలుకు వెళ్లారు. హైకోర్టు ఆదేశంతోనే వైఎస్ జగన్మోహన్‌రెడ్డి అవినీతి అక్రమాలపై సిబిఐ విచారణ చేస్తుంది. ఇనుప ఖనిజ అక్రమ రవాణాతో వేల కోట్లు దోచేసిన గాలి జనార్దన్‌రెడ్డి జైలు ఊచలు లెక్కపెడుతున్నాడు. ఈ చర్యలన్నీ రాజకీయ నాయకులకు కంటకింపుగా వుంది. జడ్జీలు దేశాన్ని పాలించరాదని వ్యాఖ్యానిస్తున్నారు. న్యాయవ్యవస్థ జోక్యం చేసుకోబట్టే దేశంలోని ఎన్నో కుంభకోణాలకు ముకుతాడు పడింది. తనామనా తేడా లేకుండా విచారణ చేయించబట్టే కొన్ని కేసుల్లో జడ్జీలు సైతం జైలు జీవితం గడుపుతున్నారు. న్యాయవ్యవస్థలో సంచలనానికి నాంది పలికిన సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి కపాడియాను అభినందించకుండా ఉండలేము.

వాస్తు రామచంద్ర — నెల్లూరు

### కాంగ్రెస్ ప్రభుత్వానికి అభినందనలు!

ఈనాడు ఏవార్తా పత్రిక, ఛానల్, రాజకీయ నాయకులు, ఐఎఎస్ అధికారులు, జనం సందు లేకుండా మాట్లాడుకుంటుండేది ఒకే విషయం. అది రాజశేఖర్‌రెడ్డి హయాంలోని లక్షల కోట్ల అవినీతి గూర్చే. రాజశేఖర్‌రెడ్డి కాంగ్రెస్ వాడైనా ఈనాటి కాంగ్రెస్ ప్రభుత్వం దాని ఆనుపానులు సిబిఐ చేత త్రవ్వి బయటకు తీస్తోంది. మామూలుగా తమ పార్టీ వాళ్లు ఏదైనా తప్పు చేస్తే కప్పిపుచ్చే ప్రయత్నం చేస్తారేగాని రచ్చకీడ్చరు. ఈనాడు కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

12-9-1942
పేజీలు : 8 వెల: అణా

### గోపాలరెడ్డి వివాహ మహోత్సవం

స్థానిక స్వపరిపాలనా మంత్రి బెజవాడ గోపాలరెడ్డి గారికిని, శ్రీయుత తిక్కవరపు రామిరెడ్డిగారి ద్వితీయ పుత్రిక శ్రీమతి సౌభాగ్యవతి లక్ష్మీకాంతమ్మకు వివాహము 8వ తేది సాయంత్రం 6.30 గంటలకు మదరాసున పచ్చయప్ప హాస్టలు ఆవరణమున అతి వైభవోపేతంగా జరిగెను.

### పౌరోహిత్యం

ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారు పౌరోహితులు. వైదిక మంత్రాలను తెలుగున అనువదిస్తూ, ఆధునిక పద్ధతిలో వివాహం జరిపారు. ముఖ్య మంత్రాలన్నీ వధూవరుల చేత తెలుగులోనే చెప్పించబడెను. వివాహ సంస్కారం యావత్తు ఒక్క గంటలోపుగా ముగింపబడెను.

### కళ్యాణ మంటపం

కళ్యాణ మంటపం మదరాసు ఆర్టు స్కూలు వైస్ ప్రిన్సిపాలు వి.ఆర్.చిత్ర గారిచే నిర్మింపబడింది. రకరకాల పువ్వులతోను, పచ్చని ఆకుతోరణాలతో, వివిధ వర్ణాల విద్యుద్దీపాలతోను వివాహ వేదిక నేత్రోత్సవంగా అలంకరింపబడింది. స్వరాజ్య పతాకపు త్రివర్ణకాంతులు విద్యుద్దీపాల ప్రభతో ప్రకాశిస్తూ కనుల పండువ చేసినవి. సువిశాలమైన ఆ ప్రదేశంలో సుమారు రెండువేల మంది ప్రేక్షకులు పెద్దలు, పిన్నలు, స్త్రీ, పురుషులు, అన్ని జాతులవారు సమావేశమైరి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

7-9-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### పాకిస్తాన్‌లో వినోబా యాత్ర

గత 17 మాసాల నుండి అస్సాంలో భూదాన యాత్ర చేస్తూ 929 గ్రామ దానాలను; 56వేల సంపద దానాన్ని సంపాదించిన భూదాన మహర్షి వినోబాభావే మొన్న(5వ తేది) తూర్పు పాకిస్తాన్‌లో ప్రవేశించారు. వారి వెంట వారి అనుచరులు ఐదు మంది మాత్రం ఉన్నారు. భారత పత్రికా విలేఖరులు వారిననుసరించుటకు పాకిస్తాన్ ప్రభుత్వం అనుమతించలేదు. భూదాన ప్రచారము, సౌహార్ద సందేశము తన పాకిస్తాన్ యాత్రా లక్ష్యమన్నారు వినోబా! వినోబాజీ యాత్ర పాకిస్తాన్‌లో పెద్ద తుపాను లేవదీసింది. వారి ఈ సంచారం ఫలవంతం కాగలదని, భారతదేశం పట్ల పాకిస్తానీయుల అపోహలను, దురుద్దేశాలను పారద్రోలగలదని ఆకాంక్షిస్తున్నాము.

### ఇరాన్‌లో భూకంపం

గత వారంలో పశ్చిమ ఇరాన్‌లో భయంకరమైన భూకంపానికి దాదాపు 20వేల మంది ఆహుతయ్యారు. రెండు గ్రామాలకు చెందిన 4500 మంది ప్రజలలో ఒక్కరు కూడా మిగలకుండా భూగర్భంలో కలిసిపోయారు. మొత్తం రెండు వందల గ్రామాలు ఈ ఆపదలో చిక్కుకొన్నవి.

### నెల్లూరు ముచ్చట్లు
### పబ్లిక్ ప్రాసిక్యూటరు

పబ్లిక్ ప్రాసిక్యూటరుగా జి.సారంగపాణిగారే తిరుగా నియమింపబడినారు. వీరు తన 60వ సంవత్సరం, అంటే 29–10–1964 వరకు ఈ ఉద్యోగంలో ఉండగలరు. సారంగపాణి గారి ఈ పొడిగింపు సముచితమైనది.

# నెల్లూరు ముచ్చట్లు

## సిఐల బదలీలపై బహిరంగ విచారణ

జిల్లాలో ఒకేసారి జరిగిన 18 మంది సిఐల బదలీల్లో అవినీతి అక్రమాలు జరగడంతో డిజిపి దినేష్‌రెడ్డి బహిరంగ విచారణకు ఆదేశించారు. ఈ మేరకు విచారణ అధికారి ఎస్.ఎ హుడా, ఇన్‌ఛార్జ్ గుంటూరు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ కె.వి.రాజేంద్రనాధ్‌రెడ్డి 5వ తేది నెల్లూరు వచ్చారు. పోలీసు అతిథి గృహంలో ఉదయం 10 గంటల నుంచే ఫిర్యాదులు, వివరణలు స్వీకరించను కూర్చొన్నారు. కాని అన్యాయం జరిగిన ఒక రిద్దరు మినహా ప్రమోషన్లు పొందిన సిఐ లెవ్వరూ నోరు విప్పక పోవడం విశేషం.

## పెరిగిన కోడిగుడ్ల ధరలు!

కోడిగుడ్ల రేట్లు అమాంతంగా పెరిగిపోయాయి. డజను కోడి గుడ్లు 44 రూపాయలు. విడిగా ఓ గుడ్డు నాలుగు రూపాయలకు అమ్ముతున్నారు. ఇంతగా రేటు పెరిగినా నెల్లూరు మార్కెట్‌లో అమ్మకానికి సిద్ధంగా ఉన్న గుడ్లు మరీ చిన్నవిగా ఉన్నాయి. నెల్లూరుకు చిత్తూరు, నమక్కల్ నుంచి కోడిగుడ్లు వస్తాయి. రవాణా ఛార్జీలు తక్కువే. మరి ఈ రేట్లేమిటో?

## సిఎంకు వివేకా ప్రశంస!

ఎవరు రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉంటే వారి భజన చేయడం నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డికి వెన్నతో పెట్టిన విద్య. ఈ మధ్య పత్రికల వాళ్లతో మాట్లాడుతూ దివంగత వైఎస్ రాజశేఖర్ రెడ్డిని తెగిడిన ఆయన ప్రస్తుత ముఖ్యమంత్రి నల్లారి కిరణ్‌కుమార్ రెడ్డిని పొగిడారు. ఆయన అవినీతికి ఆమడదూరంలో ఉండే ముఖ్యమంత్రన్నారు. పిసిసి అధ్యక్షుడిగా తన సోదరుడు ఆనం రామనారాయణరెడ్డికి అధిష్టానం అవకాశమిస్తే పని చేసే ఓపిక ఉందని అయితే ఈ పదవి విషయంలో ప్రత్యేక ఆశ, అత్యాశ తమ కుటుంబానికి లేదన్నారు.

## వైకాపా బంద్ పాక్షికం!

విద్యుత్ కోతలకు నిరసనగా 31వ తేది వైకాపా పిలుపు మేరకు రాష్ట్ర వ్యాపితంగా జరిగిన బంద్‌కు జిల్లాలో పాక్షిక స్పందన లభించింది. పార్టీ నాయకులు ఎవరికి వారే యమునా తీరే అన్నట్లు వ్యవహరించడం, పోలీసుల రంగ ప్రవేశంతో అన్ని ప్రాంతాలకు ఆర్టీసి బస్సులు తిరిగాయి. స్కూళ్లు, షాపులు మాత్రం మూత వేయించగలిగారు. సినిమా హాళ్లలో సైతం అన్నీ ఆటలు ప్రదర్శించారు. నెల్లూరులో ఆ పార్టీ నేతలకు ఈ బంద్ కనువిప్పు కలిగించి ఉంటుందనుకొంటాం.

## నెల్లూరు ఓఎస్డీ బదలీ

నెల్లూరు నగర ఓఎస్డీ నరసింహ కిషోర్‌ను విశాఖపట్నం గ్రామీణ ఎస్పీగా ప్రమోషన్‌పై బదలీ చేశారు. నరసింహ కిషోర్ నెల్లూరు వచ్చి ఏడాది గడిచినా తనదైన ముద్రవేస్తూ ఆయన పనిచేయ లేకపోయారు.

## ఇసుక రీచ్‌లలో సిసి కెమెరాలు!

జిల్లాలోని ఇసుక రీచ్‌ల నుంచి ఇసుక అక్రమ తరలింపును అడ్డుకోను ప్రభుత్వం అన్ని రీచ్‌లలో సిసి కెమెరాలు ఏర్పాటు చేయమని ఆదేశించింది. ఈ మేరకు ఏర్పాట్లు చేస్తున్నట్లు ఇన్‌ఛార్జ్ జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం చెప్పారు.

## జైలు సూపరింటెండెంట్

నెల్లూరు సెంట్రల్ జైలు సూపరింటెండెంట్‌గా రవికిరణ్ నియమితులయ్యారు. ఈయన గుంటూరు జైలు సూపరింటెండెంట్‌గా పనిచేస్తూ ఇక్కడకు బదలీ అయ్యారు. నెల్లూరు జైలు సూపరింటెండెంట్ ఆగష్టు 31వ తేది పదవీ విరమణ చేయడంతో కొత్త సూపరింటెండెంట్ నియామకం జరిగింది.

## ఎమ్మార్పీల వ్యవస్థ రద్దు!

ఉపాధ్యాయుల్లో కొందరిని మండల రిసోర్సుపర్సన్లుగా గతంలో నియమించారు. రాను రాను వీరికి పనిలేకుండా పోయి రకరకాల వ్యాపారాల్లో మునిగి తేలుతున్నారు. ఈ వ్యవస్థపై విపరీతంగా విమర్శ రావడంతో రద్దు చేస్తున్నట్లు డిఇఓ ప్రకటించారు. ఎమ్మార్పీలు తాము పనిచేసే పాఠశాలల్లో డ్యూటీ చేపట్టమని చెప్పారో లేదో వీరు హైకోర్టుకు వెళ్లి స్టే తెచ్చి దాన్ని డిఇఓకు ఇచ్చి మళ్లీ తమ వ్యాపారాల్లో తాము బిజీ అయిపోయారు.



నెల్లూరు ఇందిరాభవన్‌లో జరిగిన వైఎస్ రాజశేఖర్‌రెడ్డి వర్ధంతి సభలో ఆయన చిత్రపటానికి పూలమాలవేసి నివాళులర్పిస్తున్న పందిళ్లపల్లి అరుణమ్మ, రఘు, ఉడతా వెంకట్రావు తదితరులు.

## రసరమ్యంగా యాదేరఫీ

మధుర గాయకుడు మహమ్మద్ రఫీ 32వ వర్ధంతిని పురస్కరించుకొని మహమ్మద్ రఫీ కల్చరర్ అకాడమీ 2వ తేది అనిల్ గార్డెన్స్‌లో నిర్వహించిన యాదేరఫీ కార్యక్రమం రసరమ్యంగా జరిగింది. దుబాయ్ గాయకులు ఎహ్‌తె షామ్, సిమ్రాన్‌లు పాడిన రఫీ గజల్స్,

కొరవ 14వ పేజీలో

### తొమ్మిదవ వర్ధంతి



శ్రీమతి ఖాసిం బీబీ
W/o లేట్ మహబూబ్ సాహెబ్
అల్లూరు.
మరణం :14.9.2003

అమ్మా! నీవు మాకు దూరమై
అప్పుడే తొమ్మిదేళ్లయ్యాయి
ఎన్నేళ్లు గడిచినా
ఎద వీడిపోని నీ జ్ఞాపకాలు
నా హృదిలో గిలిపెడుతున్నాయి
నీ ప్రేమ, ఆప్యాయతలు
ఈ జన్మలో మరవలేనమ్మా!

... అల్లూరు రహీం (కుమారుడు)
గౌసున్నీసా బేగం (కోడలు)
ఆషిక్ (మనుమడు)

### ఉత్తరక్రియలు







మా తండ్రి

**తూపిలి సుబ్బరామిరెడ్డి గారు**

తేది. 31.08.2012, శుక్రవారం స్వర్గస్తులైనారు.

వారి పవిత్రాత్మకు శాంతిని చేకూర్చమని భగవంతుని ప్రార్థిస్తూ...

**ఉత్తరక్రియలు:**
తేది.12.09.2012
బుధవారం
కోవూరు మండలం,
లేగుంటపాడులోని మా
స్వగృహము నందు జరుగునని
తెలియజేయడమైనది.

తూపిలి కృష్ణారెడ్డి - దేవసేన

| కుమార్తెలు | - అల్లుళ్ళు |
|---|---|
| నీలపరెడ్డి సుగుణమ్మ | - లేట్ వెంకటరమణారెడ్డి |
| చెన్నారెడ్డి మంజులమ్మ | - లేట్ మస్తాన్‌రెడ్డి |
| లేట్ జక్కా సౌదామిని | - జక్కా శ్రీనివాసులురెడ్డి(జె.ఎస్.రెడ్డి) |

# కార్పొరేషన్ అక్రమ బాదుడు!

• యుఏసి పన్ను పేరిట ప్రజలపై రూ. 2 కోట్ల వడ్డింపు!

నెల్లూరు కార్పొరేషన్ ప్రజలకు కనీస సౌకర్యాల కల్పనలో ఘోరంగా విఫలమయ్యింది. కొళాయిల్లో నీరు సక్రమంగా రావు. వీధిలైట్లు వెలగవు. డ్రైనేజీలు శుభ్రపరచరు. చెత్త ఎత్తరు. కానీ వివిధ అక్రమ మార్గాల్లో పిచ్చి పిచ్చి పన్ను వసూళ్లకు పూనుకోవడం విమర్శలకు తావిస్తుంది. ఈ మధ్య కార్పొరేషన్ జారీచేసిన ఆస్తి పన్ను డిమాండ్ నోటీసుల్లో యుఏసి పేరిట చెల్లించాల్సిన పన్నుకు అదనంగా మరోపది శాతం చెల్లించమని పేర్కొనింది. యుఏసి అంటే 'అన్ ఆథరైజ్డ్ కన్‌స్ట్రక్షన్స్' అని అర్థం. అంటే మన ఇల్లు అక్రమ కట్టడం అన్నమాట. వంద యేళ్ల క్రితం కట్టిన భవనాలు, ఇళ్లకు సైతం యుఏసి కట్టమని డిమాండ్ నోటీసులు జారీ చేశారు. వన్‌టౌన్ ప్రాంతంలో వేలాది మందికి ఈ నోటీసులు అందాయి. ఈ పన్ను విధించడానికి కారణమేమిటంటే 2011 – 12 సంవత్సరంలో నగరంలో నిర్వహించిన ఆస్తి పన్ను రివిజన్ కార్యక్రమం. ఈ కమిటీలో రివిజన్ కార్యక్రమంపై ఓనమాలు కూడా తెలియని వ్యక్తులను సభ్యులుగా నియమించారు. నగరంలో షట్టర్ వాడిన ప్రతి భవనానికి షాపు రూములంటూ చదరపు మీటరుకు 180 రూపాయల చొప్పున పన్ను విధించి పారేశారు. ఇదేమిటని ఒకరిద్దరు ప్రజలు వీరిని ప్రశ్నించగా తాము యూసేజ్ (వాడుక) ప్రాతిపదికనగాక షట్టర్ ప్రాతిపదికన తాము పన్ను విధించామని చెప్పినట్లు జరిగింది. యుఏసి పన్ను మూలంగా రెండు కోట్ల రూపాయలు. రివిజన్ పేరిట మరో ఐదు కోట్ల రూపాయల పన్ను నెల్లూరీయుల నెత్తిన పడిన విషయం డిమాండ్ నోటీసులు వస్తేగానీ తెలియరాలేదు. ప్రజలనెత్తిన ఇంత భారంపడ్డా అధికార పార్టీ ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డి నోరు మెదపలేదు. వైకాపా, తెలుగుదేశం, సిపిఐ పార్టీలకు దొడ్డిదారిన పెంచిన ఈ పన్ను వ్యవహారం తెలిసినట్లు లేదు. పెంచిన పన్నుపై రివిజన్ పెట్టుకొన్న వారికి ఈ వ్యవహారమై ది గ్రేట్ మునిసిపల్ కమిషనర్ డాక్టర్ ఆంజనేయులు ఇంతవరకు జవాబు ఇవ్వలేదు. 900 పిటిషన్లు కార్పొరేషన్ కార్యాలయంలో పెండింగ్‌లో ఉన్నాయి. సమాచార హక్కు సంఘాలు గట్రా ఉన్నా కొన్ని తెలియని పన్నుల పేరిట ప్రజలపై వేసిన ఈ భారాన్ని ప్రజలు కట్టకుండా ఒక ఉద్యమించాల్సిన అవసరం ఉంది. పలువురు పోరాట యోధులున్న వైకాపా నాయకత్వం ఈ అక్రమ పన్నుల వ్యవహారమై ప్రజాపక్షాన నిలచి పోరాటం చేస్తే బాగుంటుంది.

## విదేశాల్లో ఉద్యోగం పేరిట మోసం!

వేధిస్తున్న నిరుద్యోగం, మాయమాటలకు జనం మోసపోవడం రివాజుగా మారింది. ఉద్యోగాలిప్పిస్తామని డబ్బు దండుకొని పలువురిని మోసగించిన కేసులో విశాఖపట్టణానికి చెందిన లక్ష్మణ్‌రావును నెల్లూరు టూటౌన్ పోలీసులు అరెస్ట్ చేశారు. లక్ష్మణ్‌రావు బాగా చదువుకొన్న వ్యక్తి. కష్టపడకుండా సంపాదించాలని ప్రజలను మోసగించడమే పనిగా పెట్టుకొన్నాడు. నెల్లూరు జేమ్స్‌గార్డెన్‌కు చెందిన కమతం లక్ష్మి విశాఖపట్టణంలో ఉండగా లక్ష్మణ్‌రావు ఆమెను పరిచయం చేసుకొని కెనడాలో ఉద్యోగం ఇప్పిస్తానని ఆమెను నమ్మబలికి డబ్బు తీసుకొన్నాడు.

**కెనడాలో ఉద్యోగాలంటూ నిరుద్యోగులకు టోపీ!**

నవాబుపేటకు చెందిన ప్రగడం సురేష్, విడవలూరు ప్రదీప్, బుచ్చికి చెందిన లావణ్యల వద్ద కెనడాలో ఉద్యోగం పేరిట ఒక్కొక్కరి నుంచి 15,560 రూపాయలు తీసుకొన్నాడు. సురేష్ వద్ద మాత్రం మంచి ఉద్యోగం అంటూ మరో 50వేల రూపాయలు అదనంగా తీసుకొన్నాడు. డబ్బు తీసుకొన్నప్పటి నుంచి ఉద్యోగం గూర్చి అడిగితే వారికి సరైన సమాధానం చెప్పక తప్పించుక తిరుగుతున్నాడు. బాధితులు డబ్బు తిరిగి ఇవ్వమంటే దిక్కున్నచోట చెప్పుకోమనగా వాళ్లు టూటౌన్ పోలీసులకు ఫిర్యాదు చేయగా లక్ష్మణ్‌రావును అరెస్ట్‌చేసి కోర్టుకు హాజరుపర్చారు. విదేశాల్లో ఉద్యోగం ఇప్పిస్తామని చెప్పే ఏజెంట్ల గూర్చి పూర్తి వివరాలు తెలుసుకొన్నాకే డబ్బులు ఇవ్వాలంటున్నారు నెల్లూరు పట్టణ తూర్పు సర్కిల్ సిఐ కోటారెడ్డి.

శిలాఫలకానికి పూజలు చేస్తున్న కళాకారులు.

• ఓపెన్ ఆడిటోరియం

## శిలాఫలకం వేసి పుష్కరం!

**స్వతంత్ర పార్కులో కళాకారుల నిరసన**

నెల్లూరులో ఓ సభో, నాటకమో, ఆధ్యాత్మిక ఉపన్యాసమో పెట్టుకోవాలంటే వేదిక బాడుగలు, ఇతర ఖర్చులు సామాన్యులకు అందుబాటులో లేవు. ఈ నేపథ్యంలో గాంధీబొమ్మ దగ్గరున్న స్వతంత్ర పార్కులో ఓపెన్ ఆడిటోరియం నిర్మాణానికి శిలాఫలకం వేసి 12 ఏళ్లయ్యింది. కానీ పని మొదలుకాలేదు. దీన్ని నిరసిస్తూ ఆంధ్రప్రదేశ్ జానపద కళాకారుల సంఘం నేతృత్వంలో కళాకారులు 28వ తేది శిలాఫలకం వద్దచేరి దానికి పసుపు, కుంకుమపెట్టి, పూలమాలలు వేసి నిరసన తెలిపారు. ఈ సందర్భంగా సహస్రసభా సింహం బి.వి.నరసింహులు మాట్లాడుతూ కళాకారుల బాధలను గుర్తించి వెంటనే ఆడిటోరియం నిర్మించాలని కోరారు. ఈ కార్యక్రమంలో సంఘం అధ్యక్ష, కార్యదర్శులు శింగంశెట్టి మురళీమోహన్, కార్యదర్శి సరాబు శ్రీనివాస కుమార్‌తోపాటు పదుల సంఖ్యలో కళాకారులు పాల్గొన్నారు.

## నగరంలో పేరుకుపోయిన చెత్త!

**కనపడని చెత్త ఆటోలు**

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ పరిధిలో చెత్తను రవాణా చేసేందుకు ఏర్పాటుచేసిన ఆటోలు కొన్ని ప్రాంతాలకే పరిమితమైపోయాయి. వీధుల్లో వేసిన చెత్తాచెదారాన్ని ప్రతిరోజు తరలించేందుకు మునిసిపల్ కార్పొరేషన్ లక్షలాది రూపాయలు ఖర్చుచేసి హైడ్రాలిక్ ఆటోలను కొనుగోలు చేసింది. చెత్తను తొలగించేందుకు అవసరమైన పారిశుద్ధ్య కార్మికులను ఏర్పాటు చేశారు. అయినప్పటికీ చెత్తను తొలగించడంలో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. కార్పొరేషన్ పరిధిలో 50 డివిజన్లు ఉన్నాయి. హైడ్రాలిక్ ఆటోలతోపాటు ట్రాక్టర్లు, మినీలారీలు కూడా ఉన్నాయి. ఇన్ని వాహనాలు ఉన్నప్పటికీ కొన్ని డివిజన్లలో రోజుల తరబడి చెత్తను తొలగించడం లేదు. వీధుల్లో పేరుకుపోయిన చెత్తలో కుక్కలు, పందులు స్వైరవిహారం చేస్తున్నాయి. పారిశుద్ధ్యాన్ని ప్రతిరోజు, ఉదయం, సాయంత్రం పర్యవేక్షించాల్సిన శానిటరీ ఇన్స్‌పెక్టర్లు, సూపర్ వైజర్లు ఎక్కడ విధులు నిర్వహిస్తున్నారో అర్థంకాని పరిస్థితి. నగరంలో రోజురోజుకు పారిశుద్ధ్యం చాలా అధ్వాన్నంగా తయారవుతుంది. కార్పొరేషన్ కమిషనర్ ఆకస్మికంగా తనిఖీ చేసినప్పుడు కూడా శానిటరీ ఇన్స్‌పెక్టర్ల నిర్లక్ష్యం కనిపిస్తుంది. ఇటీవల విధి నిర్వహణలో నిర్లక్ష్యంగా వ్యవహరించిన ఒక శానిటరీ ఇన్స్‌పెక్టర్‌ను కమిషనర్ సస్పెండ్ చేయడం జరిగింది. కమిషనర్ నిత్యం తనిఖీలు చేయడం సాధ్యంకాని పరిస్థితి. కిందిస్థాయి అధికారులు స్పందించి పారిశుద్ధ్యాన్ని మెరుగు పరచడంతోపాటు పేరుకుపోయిన చెత్తను తొలగించేందుకు చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఉంది. పేరుకుపోయిన చెత్త మూలంగా రకరకాల వ్యాధులతో జనం సతమతమౌతున్నారు.

## వాహన డ్రైవర్లపైనా కేసులు!

**ఇసుక అక్రమ రవాణా కట్టడికి యత్నం**

అక్రమంగా ఇసుక తరలించే ట్రాక్టర్లను సీజ్ చేయడంతోపాటు వాటిని నడిపే డ్రైవర్లపై కూడా కేసులు నమోదు చేస్తామని ఇన్‌ఛార్జ్ జాయింట్ కలెక్టర్ బి.లక్ష్మీకాంతం హెచ్చరించారు. ఈ విషయమై వివరిస్తూ సరైన అనుమతి పత్రాలు లేకుండా ఇసుక అక్రమ రవాణా చేసే వాహనాన్ని సీజ్ చేయడమేగాక సంబంధిత డ్రైవర్, వాటి యజమానులపై కూడా ప్రభుత్వ ఆస్తులు దొంగతనం చేస్తున్నందుకుగాను క్రిమినల్ కేసులు నమోదు చేస్తామని హెచ్చరించారు. ఆయా సెక్షన్ల క్రింద డ్రైవర్లు, యజమానుల్ని అరెస్ట్ చేస్తామన్నారు. వాహన యజమానులు ఇసుకను అధికారికంగా రీచ్ నుంచి అనుమతులతో మాత్రమే పొందాలని సూచించారు. అలా కాకుండా నిబంధనలు ఉల్లఘించి ఇసుక రవాణా చేస్తే వారిపై కఠిన చర్యలు తీసుకొంటామన్నారు.

## కూపన్‌దారులకు రేషన్ కార్డులు!

**ఉత్తర్వులు జారీచేసిన ప్రభుత్వం**

జిల్లాలో నిర్వహించిన రచ్చబండ కార్యక్రమం ద్వారా రేషన్ కూపన్లు పొందిన వారికి త్వరలో రేషన్ కార్డులు అందించనుంది ప్రభుత్వం. ఈ మేరకు జిల్లా పౌరసరఫరాల శాఖకు ప్రభుత్వం నుంచి ఉత్తర్వులందాయి. గతంలో రేషన్ కార్డుల సర్వే అంటూ అర్హత గలవారి కార్డులను సైతం రెవిన్యూ అధికారులు రద్దు చేయడం జరిగింది. రద్దు చేసిన రేషన్ కార్డులను తిరిగి పునరుద్దరించాలని పలు దఫాలు విన్నవించినా ప్రయోజనం లేకుండా పోయింది. ఒక ప్రక్క సబ్సిడీ సరుకులు పొందలేక పోవడం, మరో ప్రక్క అనేక మంది వృద్ధాప్య పెన్షన్ పొందలేక పోయారు. ప్రతి పథకానికి రేషన్ కార్డును ముడి పెట్టడంతో పేద ప్రజలు ఇబ్బంది పడక తప్పలేదు. రచ్చబండ కార్యక్రమం పుణ్యమా అంటూ కార్డులకు బదులు సబ్సిడీ సరుకులు పొందేందుకు గత సంవత్సరం కూపన్లు పంపిణీ చేశారు అధికారులు. భవిష్యత్తులో ఆధార్ కార్డులను అన్ని పథకాలకు అనుసంధానం చేయాలన్న ఉద్దేశంతో కొత్తగా రేషన్ కార్డులు మంజూరు చేయరాదని ప్రభుత్వం భావించింది. అయితే ఆధార్ కార్డుల జారీ ఇంకా పూర్తి కాకపోవడంతో కూపన్‌దారులకు పర్మినెంటు రేషన్ కార్డులు జారీ చేయాలని నిర్ణయించారు. కుటుంబసభ్యులు పోస్టు కార్డు సైజు కలిగిన ఫోటోను తీయించుకుని, మండల తహశీల్దార్ కార్యాలయంలో దరఖాస్తు పూర్తిచేసి అన్ని వివరాలు నమోదుచేసి సమర్పించాల్సి ఉంటుంది. ఈ ప్రక్రియ ఈ నెలాఖరులోగా పూర్తి చేయాలని పౌరసరఫరాల శాఖ తహశీల్దార్లను ఆదేశించింది.

# విద్యాభివృద్ధికి సుజాతమ్మ ట్రస్ట్ చేయూత!

## కదిరినాయుడు పల్లెలో విస్తృత సహకారం



విద్యార్థులకు పుస్తకాలు పంపిణీ చేస్తున్న డిఇఓ రామలింగం.

మర్రిపాడు మండలం కదిరినాయుడుపల్లిలో విద్యాభివృద్ధికి, పాఠశాలల అభివృద్ధికి కృషి చేస్తోంది కె.సుజాతమ్మ చారిటబుల్ ట్రస్టు. ఉత్తమ ఫలితాలు సాధిస్తున్న ఆయా పాఠశాలల విద్యార్థులను ప్రోత్స హించడంతోపాటు, చక్కని విద్య అందిస్తున్న పాఠశాలల ఉపాధ్యాయ సిబ్బందిని సన్మానిస్తూ, పేద విద్యార్థులకు తనవంతు సహాయ సహకారాలు అందిస్తుంది ఈ ట్రస్టు. ఇటీవల 2012 సంవత్సరంలో పదవ తరగతిలో మండల పరిధిలో మంచి ఫలితాలు సాధించిన విద్యార్థులకు ప్రశంసాపత్రాలు, మెమెంటోలను అందించడంతోపాటు టీచర్లను సన్మానించారు. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగం విచ్చేసి మాట్లాడారు. సుజాతమ్మ చారిటబుల్ ట్రస్టు చేస్తున్న కృషిని అభినందించారు. ట్రస్టు ఛైర్మన్ పి.శేషారెడ్డి మాట్లాడుతూ ట్రస్టు ఆధ్వర్యంలో జరుగుతున్న సేవా కార్యక్రమాలను వివరించారు. పిల్లలను ప్రోత్సహించడం, వారికి వెన్నుదన్నుగా నిలవడం ట్రస్టు ఉద్దేశమన్నారు. అమెరికాలో వున్న డాక్టర్ ఓబులరెడ్డి, డాక్టర్ సుమిత్రారామిరెడ్డిల సహాయ సహకారాలతో గత ఆరేళ్లుగా పాఠశాలల అభివృద్ధికి, విద్యార్థులకు సహాయం అందించామన్నారు. పిల్లలకు ఉచితంగా యూనిఫారాలు, నోటు పుస్తకాలు, చెప్పులు, క్రీడాసామాగ్రిని దాదాపు 4లక్షల రూపాయలు ఖర్చుపెట్టి అందిస్తున్నామన్నారు. భవిష్యత్తులో మరింతగా విద్యాభివృద్ధికి కృషి చేస్తామన్నారు. పదవతరగతి పరీక్షల్లో మొదటి మూడు ర్యాంకులు సాధించిన పిల్లలకు కార్పొరేట్ కాలేజీలలో విద్యను అందించేందుకు రామిరెడ్డి గంగిరెడ్డి, రామలక్ష్మమ్మ చారిటబుల్ ట్రస్టు ముందుకు వచ్చింది. ఇంటర్, ఇంజనీరింగ్ చదుతున్న పలువురు విద్యార్థులకు నగదును చెక్కుల రూపంలో అందజేశారు. ఈ కార్యక్రమంలో ఉప విద్యాశాఖాధికారి దశపతిరావు, మాజీ సర్పంచ్ ఆర్.రాధాకృష్ణారెడ్డి, ప్రధానోపాధ్యాయుడు మధుసూధన్‌రావు తదితరులు పాల్గొన్నారు.

# ముఖ్యమంత్రి రాజీనామా చేయాలి!

## ● ప్రభుత్వం వైఫల్యాలను ఎండగట్టిన కాకాణి

రాష్ట్రాన్ని అంధకారం చేసిన ఘనత ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డిదేనని వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి విమర్శించారు. విద్యుత్ కోతలకు నిరసనగా ఆగష్టు 31వతేది ఆ పార్టీ రాష్ట్రవ్యాప్త బంద్ నిర్వహించింది. దీనిలో భాగంగా కావలి పట్టణంలో ఆ పార్టీ నియోజకవర్గ ఇన్‌చార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి ఆధ్వర్యంలో బంద్ నిర్వహించారు. బంద్‌లో పాల్గొన్న కాకాణి గోవర్ధన్‌రెడ్డి మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వ తీరుపై విమర్శలు గుప్పించారు. విద్యుత్ కోతలతో ప్రజలు అల్లాడుతున్నా పాలకులకు ఏమీ పట్టడం లేదన్నారు. కరెంటు వైఫల్యానికి బాధ్యత వహిస్తూ ముఖ్యమంత్రి తన పదవికి రాజీనామా చేయాలని డిమాండ్ చేశారు. అనంతరం ఉదయగిరిరోడ్డు కూడలిలో రాస్తారోకో చేపట్టారు. ఈ బంద్‌లో చింతంబాబుల్‌రెడ్డి, మాల్యాద్రి, షాహుల్, ప్రభాకర్, విజయభాస్కర్‌రెడ్డి తదతరులు పాల్గొన్నారు.

## ● పలు ప్రత్యేకతల

# ఎన్‌బికెఆర్ ఇంజనీరింగ్ కాలేజి!

విద్యానగర్‌లోగల ఎన్‌బికెఆర్ ఇంజనీరింగ్ కళాశాల రాయలసీమ రీజియన్ పరిధిలో ప్రథమస్థానాన్ని, రాష్ట్రస్థాయిలో పదవ స్థానాన్ని సాధించింది. కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు తమ పరిశీలనలో ఈ కళాశాలలో అందుతున్న విద్య, మౌలిక సదుపాయాలపై సంతృప్తి వ్యక్తం చేసి రీజియన్ పరిధిలో మొదటి స్థానాన్ని కేటాయించినట్లు కళాశాల కరస్పాండెంట్ నేదురుమల్లి రామ్‌కుమార్‌రెడ్డి తెలిపారు. కళాశాలలో జరిగిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడారు. రాష్ట్రప్రభుత్వం వివిధ కమిటీల నివేదికలను పరిశీలించి ఈ గుర్తింపునిచ్చిందన్నారు.



వివరాలు వెల్లడిస్తున్న ఎన్‌బికెఆర్ ఇంజనీరింగ్ కాలేజి కరస్పాండెంట్ నేదురుమల్లి రామ్‌కుమార్‌రెడ్డి. ప్రక్కన డాక్టర్ ఐ.గోపాల్‌రెడ్డి, విజయకుమార్‌రెడ్డి.

ఉన్నత ప్రమాణాలతో సాంకేతిక విద్యను అందిస్తున్నందున ఇంతటి పేరు లభించిందన్నారు. ఇప్పటికే యుజిసి 'నాక్' ఏ గ్రేడ్ గుర్తింపు లభించడంతోపాటు ఏఐసిటిఇ రెండుసార్లు అక్రెడిటేషన్ మంజూరు చేసిందని వివరించారు. 30,372 చదరపు అడుగుల విస్తీర్ణంలో ఏర్పాటై వున్న ఇంజనీరింగ్ కళాశాలలో బాల, బాలికలకు వేరు వేరు హాస్టల్ వసతి వుందన్నారు. అత్యాధునిక సదుపాయాలతో ల్యాబరేటరీ, లైబ్రరీని ఏర్పాటు చేశామన్నారు. గత ఏడాది 200 మందికిపైగా విద్యార్థులు క్యాంపస్ సెలక్షన్లలో ఎంపికయ్యారని తెలిపారు. ఈ సమావేశంలో జెఎన్‌టియు మాజీ వైస్ చాన్సలర్ డాక్టర్ ఐ.గోపాలరెడ్డి, డైరెక్టర్ విజయకుమార్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# ముత్యాలమ్మకు భక్తుల కానుకలు!



తూర్పుకనుపూరులో కొలువైన ముత్యాలమ్మ.

తూర్పు కనుపూరులో వెలసి వుండే ముత్యాలమ్మ తల్లికి భక్తులు బంగారు, వెండి ఆభరణాలు, పూజ సామగ్రిని సమర్పించుకొన్నారు. తమిళనాడు చుట్టుప్రక్కల ప్రాంతాలైన గుమ్మడిపూడి, పాపనకుప్పం, కొమ్మానాయుడుపేట, జంగాలపల్లి గ్రామాలకు చెందిన మునిస్వామి నాయుడు, సుధాకర్, తిరుమలై, కృష్ణయ్య, శరత్‌బాబు అమ్మవారికి రూ. 1.37 లక్షలు విలువ చేసే బంగారు నల్లపూసల దండను, రూ. 1.57 లక్షలు విలువైన వెండి పూజా సామగ్రిని ఆలయ ట్రస్టుబోర్డు చైర్మన్ వేమారెడ్డి మురళీమోహన్‌రెడ్డికి అందజేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ముత్యాలమ్మ అనుగ్రహంతో భక్తులు అధికసంఖ్యలో వచ్చి దర్శించుకోవడంతోపాటు కానుకలు విరివిగా అందజేస్తున్నారన్నారు. భక్తుల సౌకర్యాన్ని దృష్టిలో వుంచుకొని వేమారెడ్డి కుమారస్వామిరెడ్డి సహకారంతో రూ. 2.40 లక్షలు వెచ్చించి క్యూలైన్ షెడ్‌ను ఏర్పాటు చేస్తున్నట్లు తెలిపారు. ఈ కార్యక్రమంలో ఇఓ ఆవుల వెంకటేశ్వర్లు, మాజీ ఛైర్మన్ సింహాద్రి మనోహర్, మాజీ ట్రస్టీ మూర్తి, మోహన్ తదితరులు పాల్గొన్నారు.



దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి వర్థంతి సభలో రెండు కిడ్నీలు చెడిపోయిన మహిళకు పదివేల రూపాయల చెక్కును బహుకరిస్తున్న వైకాపా నేత రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి.

# కావలిలో వైఎస్‌కు గుడి!

## ఘనంగా వైఎస్ వర్ధంతి

దివంగత మాజీ ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి తృతీయ వర్ధంతిని కావలి నియోజకవర్గ పరిధిలో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలో వాడవాడలా ఘనంగా నిర్వహించారు. పట్టణ పరిధిలోని ఎమ్మార్వో కార్యాలయం వద్ద జరిగిన కార్యక్రమంలో ఆ పార్టీ ఇన్‌చార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి పాల్గొని వైఎస్ విగ్రహానికి పూలమాల వేసి ఘనవినాళులర్పించారు. పేదల గుండె చప్పుడు తెలిసిన మహానేత వైఎస్ అని కొనియాడారు. ప్రముఖ వైద్యుడు డాక్టర్ ప్రభాకర్ నాయుడు వైఎస్ చేసిన సేవలను ప్రస్తుతించారు. సొంత నిధులతో వైఎస్ఆర్‌కు గుడి కట్టిస్తామన్నారు. అనంతరం పేదలకు చీరలు, రోగులకు పండ్లు పంచిపెట్టారు. అలాగే అల్లూరు, దగదర్తి, బోగోలు మండలాల్లోను వైఎస్ వర్ధంతిని ఘనంగా జరిపారు. బిట్రగుంటలో మాజీ సర్పంచ్ పర్రి అంకులయ్య ఆధ్వర్యంలో అన్నదాన కార్యక్రమం జరిగింది. పట్టణంలో శాంతినగర్‌కు చెందిన మారుతి అనారోగ్యాన్ని దృష్టిలో వుంచుకొని 10వేల రూపాయల ఆర్థిక సహాయాన్ని అందించారు. ఈ వర్ధంతి కార్యక్రమంలో ఆ పార్టీ నేతలు తూపిలి పెంచలయ్య, వెంకటేశ్వర్లు, రఘు, మాల్యాద్రి తదితరులు పాల్గొన్నారు.




విద్యుత్ కోతలను నిరసిస్తూ ఎఐటియుసి ఆధ్వర్యంలో కలక్టరేట్ వద్ద ధర్నా నిర్వహిస్తున్న దృశ్యం.




విడిబి షుగర్ ఫ్యాక్టరీ యాజమాన్య ధోరణిని నిరసిస్తూ కలక్టరేట్ వద్ద ధర్నా చేస్తున్న చెరకు రైతులు.

# గౌరవరం రోడ్డు వ్యవహారమై గుస్సా!

## నేషనల్ హైవే అధికారులను తప్పుపట్టిన బీద మస్తాన్‌రావు




ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజాభిప్రాయం శిరోధార్యమని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు తెలిపారు. రూరల్ మండలం గౌరవరం జిల్లా పరిషత్ పాఠశాలలో అండర్‌పాస్ వంతెన నిర్మాణంపై జరిగిన ప్రజాభిప్రాయ సేకరణలో ఆయన పాల్గొని తన అభిప్రాయాలను వెల్లడించారు. అండర్‌పాస్‌ల నిర్మాణం, రోడ్డు పనుల్లో కచ్చితంగా ప్రజాభిప్రాయాలను పరిగణలోనికి తీసుకోవాలన్నారు. అందుకు విరుద్ధంగా వ్యవహరిస్తే సహించేది లేదన్నారు. హైవే అధికారులు రూల్సు పాటించడం లేదన్నారు. మీకోరకం, ప్రజలకు మరోరకంగా రూల్సు వుంటాయా అని మండిపడ్డారు. ఇష్టానుసారంగా ప్రవర్తిస్తూ రోడ్డుపై డివైడర్లు పగులగొట్టుకొని మార్గం ఏర్పాటు చేసుకోవడం, అనుకూలంగా నిర్ణయాలు తీసుకోవడం ఏమిటని ప్రశ్నించారు. రోడ్డు విస్తరణలో స్థలాలు, పొలాలు, నివాసాలు కోల్పోయిన వారికి నష్టపరిహారం చెల్లించాలని, రోడ్డు నిర్మాణ పనులు నాణ్యతతో చేయాలన్నారు. పలువురు మాట్లాడుతూ ఈ ప్రాంతంలో దక్షిణం వైపు చావిడి వద్ద ఒక వంతెన, జడ్పీ పాఠశాల వద్ద మరొక వంతెన నిర్మించాలన్నారు. ఈ కార్యక్రమంలో తహశీల్దార్ వెంకటేశ్వర్లు, కాంగ్రెస్, టిడిపిలకు చెందిన నేతలు పాల్గొన్నారు.



నెల్లూరు హరనాథపురం హాక్ ట్రస్ట్‌లో జరిగిన వైఎస్.రాజశేఖర్‌రెడ్డి వర్థంతి కార్యక్రమంలో ప్రసంగిస్తున్న ఛైర్మన్ అబ్దుల్ అజీజ్. ప్రక్కన ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి, కర్తం ప్రతాప్‌రెడ్డి.

దివంగత వైఎస్.రాజశేఖర్‌రెడ్డి వర్థంతిని పురస్కరించుకొని బిట్రగుంటలో ఆయన చిత్రపటానికి పూలమాలవేసి నివాళులర్పిస్తున్న మాజీ సర్పంచ్ పర్రి అంకులయ్య, పెంచలయ్య, వెంకటేశ్వర్లు, మాల్యాద్రి, రఘు తదితరులు.

# బోగోలు తెలుగు నాయకుడెవరు?

## ఎంపికపై మల్లగుల్లాలు

తెలుగుదేశం పార్టీ మండల అధ్యక్ష బాధ్యతలు ఎవరికి అప్పగిస్తారనే దానిపై బోగోలు మండలంలో తీవ్ర చర్చ జరుగుతోంది. మండలంలో గతంలో మంచి పట్టున్న తెలుగుదేశంపార్టీకి ఇటీవల సరైన నాయకత్వం లేక పార్టీ బలహీన పడి ప్రజలకు దూరమైందని పలువులు వ్యాఖ్యానిస్తున్నారు. వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ మండల స్థాయిలో బలంగా పాతుకుపోతున్న పరిస్థితుల్లో సరైన నాయకత్వం అవసరమని పలువురు కార్యకర్తలు భావిస్తున్నారు. ముఖ్యంగా గ్రామస్థాయిలో పార్టీని తిరిగి పటిష్టపరిచే నాయకత్వం అవసరం. ఈ పరిస్థితుల్లో కొత్తగా మండల బాధ్యతలు ఒక వ్యక్తికి అప్పగిస్తున్నారని, ఇది దాదాపు ఖరారైపోయిందని ప్రచారం జరగడంపై తీవ్రమైన చర్చ జరుగుతోంది. పలు ఆరోపణలు ఎదుర్కొన్న వ్యక్తిని, మండలస్థాయిలో మంచి పేరు లేని వారిని ఎంపిక చేసి మండల నాయకత్వ బాధ్యతలు అప్పగిస్తే పార్టీకి మేలు కంటే కీడే ఎక్కువన్నది పార్టీ కార్యకర్తలు వ్యక్తం చేస్తున్న అభిప్రాయం. దీనిపై ఎలాంటి నిర్ణయం తీసుకుంటారో చూడాల్సి వుంది.

## పంచలోహ విగ్రహాల చోరీ

కోవూరు మండలం లేగుంటపాడు గ్రామంలో గల చెన్నకేశవస్వామి ఆలయంలోని ఏడు పంచలోహ విగ్రహాలు చోరికి గురయ్యాయి. పురాతనమైన ఈ ఆలయంలో చెన్నకేశవస్వామి, భూదేవి, శ్రీదేవి విగ్రహాలు, ఉత్సవ విగ్రహాలు వున్నాయి. రాత్రి ఆలయం మూసివేసిన తర్వాత ఈ చోరీ జరిగి వుంటుందని భావిస్తున్నారు. తెల్లవారి పూజారి శ్రీనివాసులు తలుపులు తెరచి వుండడాన్ని గమనించి దొంగతనం జరిగినట్లు తెలుసుకొని పోలీసులకు సమాచారం అందించాడు. రూరల్ డిఎస్పీ బాల వెంకటేశ్వరరావు, ఇతర పోలీసు అధికారులు చోరీ జరిగిన విధానాన్ని పరిశీలించారు. ఈ సందర్భంగా డిఎస్పీ మాట్లాడుతూ పురాతన విగ్రహాలు దొంగిలించబడడం బాధాకరం అన్నారు. ఒక్కో విగ్రహం 25కేజీల బరువు వుంటుందని, ఈ విగ్రహాల విలువ 25లక్షల రూపాయలని ప్రకటించారు. త్వరలోనే దొంగలను పట్టుకొంటామని తెలిపారు.

# మత్స్యకళాశాలను అభివృద్ధి చేస్తా!



## మత్స్యశాఖ మంత్రి హామీ

రాష్ట్రంలోని ఏకైక మత్స్యకళాశాల అయిన ముత్తుకూరు మత్స్యకళాశాలను అభివృద్ధి చేసేందుకు కృషి చేస్తామని ఆ శాఖ మంత్రి విశ్వరూప్ తెలిపారు. ఇటీవల జిల్లా పర్యటనకు వచ్చిన ఆయన మత్స్యకళాశాలలో జరిగిన కార్యక్రమంలో పాల్గొన్నారు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి బడ్జెట్‌లో ప్రత్యేకంగా నిధులు కేటాయించారన్నారు. మత్స్యకళాశాలను యూనివర్శిటీగా అభివృద్ధి చేసేందుకు ముఖ్యమంత్రితో మాట్లాడి తగిన నిర్ణయం తీసుకొంటామన్నారు. స్థానిక శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి మాట్లాడుతూ సాంకేతిక పరిజ్ఞానం లేకపోవడంతో రొయ్యలు, చేపల సాగు సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నాయన్నారు. నాణ్యమైన సీడ్, ఫీడ్ ఎంపిక చేసుకొనే విషయంలో రైతులకు అవగాహన లేకుండా పోతున్నదని ఫలితంగా సాగులో నష్టాలు వస్తున్నాయన్నారు. దీనిపై అవగాహన కల్పించేలా సదస్సులు నిర్వహించాలన్నారు. పోర్టు ఏర్పాటుతో జీవనోపాధి కోల్పోయిన 8వేల మంది మత్స్యకారుల కుటుంబాలకు ఉపాధి అవకాశాలు కల్పించాలని మంత్రిని కోరారు. అనంతరం శిక్షణ పూర్తి చేసుకొన్న విద్యార్థులకు సర్టిఫికేట్లను అందజేశారు. ఈ కార్యక్రమంలో విజయడైరీ ఛైర్మన్ కొండ్రెడ్డి రంగారెడ్డి, ముత్తుకూరు సాగునీటి సంగం అధ్యక్షుడు ఈదూరు రామ్మోహన్‌రెడ్డి, చంద్రశేఖర్‌రెడ్డి, మత్స్యకళాశాలకు చెందిన ప్రభాకర్‌రావు, విద్యాసాగర్‌రెడ్డి, రమణ, హరిబాబు, తహశీల్దార్ సుశీలమ్మ తదితరులు పాల్గొన్నారు.

● సీతారాంపురంలో

# డిఎంఅండ్‌హెచ్‌ఓ తనిఖీలు!

## సరిగ్గా డ్యూటీ చేయమని వైద్య ఆరోగ్య సిబ్బందికి సలహా

డయేరియాతో బాధపడుతున్న రోగికి తగిన వైద్య చికిత్స అందించకుండా వేరొక ప్రాంతానికి తరలిస్తున్న సీతారాంపురం వైద్య సిబ్బందిపై తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేసి స్వయంగా చికిత్స అందించారు డిఎంహెచ్‌ఓ మాసిలామణి. ఆయన స్థానిక పిహెచ్‌సిని తనిఖీ చేశారు. ఆ సమయంలో సిబ్బంది హాజరు తక్కువగా వుండడం, డయేరియాతో అక్కడకు వచ్చిన తిరుపతమ్మ అనే మహిళకు చికిత్స అందించకపోవడంపై మండిపడ్డారు. పరిస్థితి విషమంగా వుంటే ఎలా తరలిస్తారు అని వైద్య సిబ్బందిపై ఆగ్రహించారు. తానే స్వయంగా ఆమెకు సెలైన్ పెట్టి వైద్యం అందించారు. అనంతరం అటెండెన్స్ రిజిస్టర్ తనిఖీ చేసి వైద్యాధికారి శ్రీనివాసులరెడ్డి, ఫార్మాసిస్టు దిలీప్ గైర్హాజరు కావడంతో వారికి మెమో ఇచ్చారు. అలాగే కొన్నిరోజులుగా విధులకు రాకుండా వున్న జూనియర్ అసిస్టెంట్ కార్తీక్‌ను సస్పెండ్ చేశారు. పద్ధతి మార్చుకోవాలని, వైద్యసేవల్లో లోపం రాకుండా చూడాలని హెచ్చరించారు.

# అక్రమ కట్టడాల పురి కావలి!

## కుంభకర్ణ నిద్రలో మునిసిపల్ అధికారులు

కావలి పట్టణంలో అక్రమ కట్టడాలు, లేఅవుట్లు యదేచ్ఛగా సాగుతున్నాయి. నిబంధనలకు విరుద్ధంగా వేస్తున్న లేఅవుట్లను, నిర్మిస్తున్న భవనాలను పరిశీలించి చర్యలు చేపట్టాల్సిన మునిసిపల్ అధికారులు ఆ పని తమది కానట్లే వ్యవహరిస్తుండడంతో అక్రమ నిర్మాణాలకు అడ్డుఆపు లేకుండా పోతోంది. ఏడాదికో శివరాత్రి అన్నట్లు  అప్పుడప్పుడు హడావిడి చేసి తమ ఉనికి చాటుకోవడం, నాలుగు రాళ్లు తొలగించి చేతులు దులుపుకోవడం తప్ప చిత్తశుద్ధిగా వ్యవహరించకపోవడంతో అనుమతులు లేకుండా కట్టడాలు, నిబంధనలకు విరుద్ధంగా లేఅవుట్లు వెలుస్తూనే వున్నాయి. వీటిపై అవగాహన లేని వారు స్థలాలను కొని నష్టపోతున్నారు తప్ప అధికారులు వైపు నుంచి ఎలాంటి చర్యలు వుండడం లేదు. అయిన వారికి ఒక రకంగా, కాని వారికి మరొరకంగా అన్నట్లు తమ చేతులు తడిపితే ఎంతటి అక్రమాలకు పాల్పడినా పట్టించుకోవడం లేదనే విమర్శలు వెల్లువెత్తుతున్నాయి. అపార్టుమెంట్లు అయితే అంతస్తుల మీద అంతస్తులు నిర్మిస్తున్నా ఆ వైపు కన్నెత్తి చూసే వారే లేకుండా పోవడంతో ఇలాంటివి జోరందుకొన్నాయి.

● ముత్తుకూరు

# ఆలయ భూముల వేలం వాయిదా!

## పెద్దలే పాల్గొనాలని 'ఈదూరు' మెలిక

ముత్తుకూరు మండలం ఈదూరులో గల చెన్నకేశవ స్వామి, విరూపాక్షస్వామి ఆలయ భూముల వేలంపాటలు వాయిదాపడ్డాయి. దేవాదాయశాఖ ఆధ్వర్యంలో ఇటీవల ఈ రెండు ఆలయాలకు సంబంధించి వేలంపాటలు నిర్వహించగా కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలకు చెందిన నేతల మధ్య వివాదం రేగి రసాభాసగా మారడంతో అధికారులు వాయిదా వేశారు. విరూపాక్ష ఆలయానికి చెందిన 74.40 ఎకరాలు, చెన్నకేశవ ఆలయానికి సంబంధించిన 121.02 ఎకరాల భూమిని కౌలు చేసుకొనేందుకు వేలం పాటలు పిలిచారు. ఏడుగురు రైతులు వేలంలో పాల్గొనేందుకు ధరావత్తు సొమ్ము చెల్లించారు. ఈ దశలో కాంగ్రెస్‌కు చెందిన ఈదూరు రామ్మోహన్‌రెడ్డి, సుబ్బరాయులు జోక్యం చేసుకొని 4,5 సర్వే నెంబర్లలో అధిక విస్తీర్ణంలో వున్న మెట్ట భూముల్ని వేలం పాడేందుకు సన్న, చిన్నకారు రైతుల శక్తిచాలదంటూ అభ్యంతరం తెలిపారు. ఈ భూములకు వేరుగా వేలం నిర్వహించాలన్నారు. దీనికి తెలుగుదేశం నేత దువ్వూరు విశ్వమోహన్‌రెడ్డి, పత్రి రత్నయ్యలు అడ్డుతగిలారు. ఇలాంటి అభ్యంతరాలను వేలం పాటలకు ముందు వ్యక్తం చేయాలని, తీరా అవి జరిగేటప్పుడు వాయిదా కోరడం సమంజసం కాదన్నారు. అలాగే బలిజపాళెంలోని దేవాదాయ శాఖ భూముల్లో కొత్తగా ఇళ్ల నిర్మాణం చేపడుతున్నారని మాజీ సర్పంచ్ చంద్రశేఖర్‌రెడ్డి ఆరోపించగా, అదే గ్రామానికి చెందిన రామచంద్రారెడ్డి వాదనకు దిగడంతో వేలం పాటల కార్యక్రమం రసాభాసగా మారింది. దీంతో ఉన్నతాధికారుల దృష్టికి ఈ సమస్యను తీసుకొనిపోయి వేలంపాటను వాయిదా వేశారు. ఈ కార్యక్రమంలో ఎండోమెంట్ సూపరింటెండెంట్ సుధాకర్, ఇఓ రామకృష్ణ, ఎస్‌ఐ వెంకటనారాయణ తదితరులు పాల్గొన్నారు.

# నిరుపయోగంగా గోడౌన్లు!

## వెంకటగిరిలో విషయమిది.

వెంకటగిరిలో రైతులకు సేవలందించేందుకు ఏర్పడిన వ్యవసాయ మార్కెట్ గోడౌన్లు ఆస్థాయిలో ఉపయోగపడడం లేదు. మార్కెట్ కమిటీలు అంతంత మాత్రంగానే వుండడం, రైతుల గురించి పట్టించుకొనేవారు లేకపోవడంతో సేవలు పూజ్యం అయ్యాయి. జిల్లాలో సెస్ వసూళ్లలో ఈ మార్కెట్ ప్రథమస్థానంలో వున్నా, కమిటీలకు మంచి రాబడి వస్తున్నా రైతు సంక్షేమానికి చేపట్టాల్సిన కార్యక్రమాలు మాత్రం శూన్యం. మార్కెట్ కమిటీ ఆధ్వర్యంలో భారీ గోడౌన్లు వున్నా రైతులు గింజధాన్యాన్ని భద్రపరచుకొనే అవకాశం కలుగడం లేదు. కమిటీ ఆధ్వర్యంలో నిర్వహించాల్సి వున్న రైతుబంధు, వైద్యశిబిరాలు, పశువైద్య శిబిరాలు ఇటీవల కాలంలో జరిగిన దాఖలాలు లేవు. మార్కెట్ కమిటీలో మౌలిక వసతుల కల్పనకు 43లక్షల రూపాయలతో పనులు జరిగినా, ఏటికేడాది రాబడి అధికమవుతున్నా రైతులకు అందాల్సిన సేవలు మాత్రం అందకపోవడంపై ఈ ప్రాంత రైతాంగం తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు.



వైఎస్.రాజశేఖర్‌రెడ్డి వర్ధంతిని పురస్కరించుకొని గూడూరు జడ్పీ హైస్కూల్‌లోని విద్యార్థులకు ప్లేట్లు, గ్లాసులు పంపిణీ చేస్తున్న వైకాపా నాయకులు పేర్నాటి శ్యాంప్రసాద్‌రెడ్డి, బత్తిన విజయకుమార్ తదితరులు.



నెల్లూరు ముత్యాలపాళెంలో దివంగత వైఎస్.రాజశేఖర్‌రెడ్డి మూడవ వర్ధంతిని పురస్కరించుకొని ఆయన చిత్రపటానికి పూలమాల వేసి నివాళులర్పిస్తున్న కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి.

# మర్రిపాడులో త్రవ్వకాలు!

## జనానికి గుప్త నిధుల పిచ్చి

గుప్తనిధుల కోసం త్రవ్వకాలు జరిపే ముఠా సంచారం జిల్లాలో అధికంగా వుంది. పురాతన ఆలయాలను గుర్తించి నిధుల కోసం గాలింపు చేస్తున్న ముఠా కదలికలు ఇటీవల పలు ప్రాంతాలలో కన్పిస్తున్నాయి. ఉదయగిరి నియోజకవర్గం మర్రిపాడులో నంది విగ్రహాన్ని కూల్చివేయడం కలకలం రేపింది. ఇక్కడి స్మశానవాటిక వద్ద చాలాకాలం నుంచి నంది విగ్రహం, వీరభద్రుడు విగ్రహాలు ప్రక్కప్రక్కనే వుండేవి. షుమారు 40ఏళ్ల నుంచి ఈ విగ్రహాలు పొలాల్లో వున్నాయి. రైతులు నారుమళ్ల సమయంలోను, ఇతరత్రా గ్రామ ఉత్సవాల సందర్భంలోను ఈ విగ్రహాలకు పూజలు చేస్తుండడం ఆనవాయితి. అలాంటి పురాతన విగ్రహాల క్రింద గుప్తనిధులు వుంటాయని భావించిన కొందరు విగ్రహాలను తొలగించి గ్యాస్ కట్టర్‌లతో రంధ్రాలు వేసేందుకు ప్రయత్నించినట్లు ఆనవాళ్లు వున్నాయి. వారి ప్రయత్నం ఫలించకపోవడంతో వదిలేసి వెళ్లారు. ఈ సంగతి తెలుసుకొన్న గ్రామస్తులు అక్కడకు వచ్చి విగ్రహాలు ధ్వంసమై వుండడాన్ని చూసి పోలీసులకు సమాచారం అందించారు. గతంలోనూ ఉదయగిరిలో నంది విగ్రహాన్ని ధ్వంసం చేసి త్రవ్వకాలకు యత్నించడం, ఇప్పుడు అలాంటి ప్రయత్నమే జరగడం ప్రజల్లో ఆందోళనను పెంచుతున్నాయి.



# గౌరవరం క్రాసింగ్ వద్ద టిప్పర్ల దూకుడు!

## జాతీయ రహదారిపై రాంగ్‌రూట్‌లో ప్రయాణం

కావలి మండలం గౌరవరం హైవేలో గల క్రాసింగ్ పాయింట్ వద్ద మళ్లీ ప్రమాదాలు చోటు చేసుకొంటున్నాయి. గత ఐదేళ్లుగా ఈ ప్రాంతంలో కావలి వైపు వెళ్లే మార్గాన్ని మూసేసి వుండడంతో ప్రమాదాలు జరిగి 147మంది మరణించగా, 72 మంది వికలాంగులుగా మారారు. కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి చొరవతో సమస్య పరిష్కారమై రాకపోకలకు వున్న అవాంతరాలు తొలగిపోయాయి. ప్రమాదాలు తగ్గాయి. ఇటీవల గత కొంతకాలంగా చెరువు నుంచి మట్టిని తోలుకుపోతున్న టిప్పర్ల వలన తిరిగి ప్రమాదాలు చోటు చేసుకొంటున్నాయి. రాత్రి పగలు అనే తేడా లేకుండా మట్టిని తరలించుకొని పోతున్న వాహనాలు కొంతదూరం ముందుకుపోయి తిప్పుకొని రావాల్సి వున్నా అలా చేయకుండా రాంగ్‌రూట్లో తిరుగుతున్నా పట్టించుకొనేవారే లేకుండా పోవడంతో తిరిగి ఈ ప్రాంతం ప్రమాదాలకు నిలయంగా మారుతోంది. దీన్ని దృష్టిలో వుంచుకొని పోలీస్, రెవెన్యూ అధికారులు అడ్డదిడ్డంగా తిరుగుతున్న వాహనాలపై కఠినంగా వ్యవహరించాలని స్థానికులు కోరుకొంటున్నారు.

# కోర్టులో వ్యవహారముంటే మేమేం చేస్తాం!

## అర్జీదారులకు నెల్లూరు ఆర్డీఓ సూచన

కోర్టులో వున్న వివాదాల పరిష్కారం కోసం ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ తిరగొద్దని నెల్లూరు ఆర్‌డిఓ మాధవీలత సూచించారు. ఇందుకూరుపేట మండలం చెల్లాయగారితోపు గ్రామంలో భూవివాదం పరిష్కారం కాకపోవడంతో తమకు న్యాయం చేయాలంటూ గ్రామస్తులు ప్రజావిజ్ఞప్తుల దినం సందర్భంగా ఆర్‌డిఓను కలసి అర్జీలు అందజేశారు. గ్రామంలో తమకు వున్న పదిఎకరాల భూమిలో కొందరు అడ్డంగా గోడకట్టి చేతికొచ్చిన పంటను కోసుకోనీయకుండా దౌర్జన్యం చేయడంతో కోర్టును ఆశ్రయించామన్నారు. న్యాయస్థానం తమకు అనుకూలంగా తీర్పు ఇచ్చినప్పటికీ అడ్డుకొంటున్నారని ఫిర్యాదు చేశారు. దీనిపై ఆర్‌డిఓ స్పందిస్తూ 48 గంటల్లో సమస్యను పరిష్కరించాలని తహశీల్దార్, స్థానిక ఎస్‌ఐలను ఆదేశించారు. ఈ సందర్భంగా ఆమె మాట్లాడుతూ కోర్టుల్లో వున్న వివాదాల విషయమై ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ తిరగవద్దన్నారు.

# రక్షణ గోడలు దెబ్బతిన్నాయి!

## వెంకటగిరి వంతెనలు ప్రమాద భరితం

వెంకటగిరి పట్టణంలో పలు చోట్ల వంతెనలకు రక్షణ గోడలు లేకపోవడంతో ప్రమాదాలు చోటు చేసుకొంటున్నాయి. కాశీపేట సమీపంలో కైవల్యా నదిపై గల వంతెనకు అప్రోచ్ రోడ్డు ప్రక్కన వున్న కాలువకు రక్షణ గోడ లేదు. గతంలో దీనిని నిర్మించినా అది కూలిపోవడంతో పరిస్థితి మొదటికి వచ్చింది. బంగారుపేట బైపాస్ రోడ్డులో కైవల్యా వంతెనకు ఇరువైపులా వున్న రక్షణగోడ కనుమరుగై పోయింది. నిత్యం వాహనాల రాకపోకలతో రద్దీగా వుండే ఈ ప్రాంతంలో దీని వల్ల ప్రమాదాలు జరుగుతున్నాయి. గొడ్డేరుపై కాంపాళెం వద్ద వున్న కాజ్‌వే, చింతగుంట, లాలాపేట, పాళెంకోట వద్ద వున్న రక్షణ గోడలు అంతరించిపోయాయి. అలాగే రామలింగేశ్వరస్వామి దేవాలయం వద్ద వంతెనపై వున్న ఫుట్‌వే దెబ్బతినిపోయింది. ఇప్పటికైనా ప్రమాదాలను దృష్టిలో వుంచుకొని ఈ ప్రాంతాల్లో రక్షణ గోడలు నిర్మించాలని ఈప్రాంత ప్రజలు కోరుకొంటున్నారు.

## ఇసుక మాఫియా

మొదటి పేజీ కొరవ

గతంలో ఇసుక వేలం పాడుకొన్న వారిని వివిధ పార్టీల నాయకులు, గ్రామాలలోని ప్రజలు ఏడ్పించుకొని తినేవారు. తమ వూళ్లో నుంచి లారీలు వెళ్లడం వల్ల రోడ్లు చెడి పోతున్నాయని, పెన్న వరద కట్టలు తెగిపోయి వూరిమీద వెల్లువ పడే ప్రమాదం వుందని, లారీల రొదకు ఇళ్లలో నిద్ర పోలేక పోతున్నామని గోల చేసే వారు. కానీ ఇప్పుడు ఏ వూరికా వూరిలోని జనమే రవాణాకు పూనుకోవడం, అందులోనూ సన్నజనం అధికంగా వుండడంతో ఏ గ్రామంలో కూడా ఇసుక అక్రమాలపై కనీసపాటి ప్రతిఘటన, అభ్యంతరం కూడా వ్యక్తం కావడం లేదు. ఎవరికి వారు తమకెందుకొచ్చిన గొడవ అని సర్దుకపోతున్నారు. సాధారణంగా సిపిఎం పార్టీ ఇటు వంటి విషయాలలో అధికంగా ఆందోళన చేయడం సాంప్రదాయం. కానీ ఇప్పుడు కమ్యూనిస్టు కార్యకర్తలే ఇసుక దొంగ రవాణాకు గ్రామాల స్థాయిలో నాయకత్వం వహిస్తున్నారు. అందువల్ల దొంగలు దొంగలు వూళ్లు పంచుకొన్నట్లు అన్ని పార్టీలు కుమ్మక్కై పోతున్నాయి.

ఈ దుర్మార్గాన్ని ఆపవలసింది మైనింగ్, రెవిన్యూ, పోలీసు, విజిలెన్స్ అధికారులు. మైనింగ్ శాఖ వద్ద సిబ్బంది లేరు. వారు రోడ్లలో మాటు వేసి రవాణాను అడ్డుకోవడం అసాధ్యం. పోలీసు వద్ద కావలసినంత బలగం వుంది. కానీ వారు లంచాలకు అలవాటు పడ్డారు. ట్రాక్టరైతే వెయ్యి, మామూలు లారీ అయితే మూడు వేలు, పెద్ద లారీ అయితే ఐదు వేల రూపాయల లెక్కన మామూళ్లు దండుకొని, రవాణాను స్వేచ్ఛగా అనుమతిస్తున్నారు. ఏ ఏ ట్రాక్టర్లు లేదా లారీలు మామూలు చెల్లించాయో గ్రామాల స్థాయి నుంచి తడ చెక్‌పోస్టు వరకు అందరు పోలీసు అధికారులకూ ముందుగానే సమాచారం వెళ్తుంది. ఆ వాహనాలను దారిలో ఏ పోలీసు కూడా ఆపడు. తమకు మామూలు కట్టని వారెవరైనా రవాణా చేస్తే మాత్రం నిలేస్తున్నారు. రెవిన్యూ అధికారులు మట్టిబొమ్మలతో సమానం. ఎమ్మెల్యే చెప్పిన మాట వినడం తప్ప వారికి మరొక అడుగు ముందుకు వేసే అనుమతి లేదు. ఎమ్మార్వో, ఆర్ఐ, విఆర్వో వంటి అధికారులు రేవులలోకి వెళ్లి, అనుమతి లేని చోట ఇసుక త్రవ్వుతుంటే పట్టుకొని, ఆ యంత్రాలను స్వాధీనం చేసుకోవచ్చు. కానీ ఏ అధికారి అయినా ఆ సాహసానికి పూనుకొంటే క్షణాలలో వివేకానందరెడ్డి నుంచి ఫోను వచ్చేస్తుంది. ఒక్కక్షణం ఆ రేవులో కన్పించినా తాట తీస్తాననే బెదరింపు వస్తుంది. దానికి భయపడి రెవిన్యూ అధికారులు పెన్న రేవులలో పాదం పెట్టడానికే హడలి చస్తున్నారు.

### పర్మిట్ ఒక్కటి రవాణా వంద వాహనాలు

వేలం జరిగిన ఇసుక రీచ్‌లలో 25వేల నుంచి 40వేల క్యూబిక్ మీటర్ల ఇసుకను మాత్రమే, అదీ ఒక ఏడాది కాలంలో త్రవ్వి తీయాలి. కానీ ఈ పరిమాణం ఒక్క నెలలో పూర్తయిపోయింది. ఒక్కొక్క రీచ్‌లో లక్ష నుంచి మూడు లక్షల వరకు త్రవ్వి, అగాధాలను తలపించే గుంటలు పెడుతున్నారు పెన్నానది గర్భంలో. ఇసుక రవాణాకు మైనింగ్ అధికారులు పర్మిట్లు ఇస్తారు. అదొక పెద్ద బోగస్ కార్యం. ఒక్కొక్క పర్మిట్ మీద వందకు పైగా వాహనాలు నడుపుతున్నారు. పర్మిట్ మీద తేది వుండదు. తతిమా వివరాలన్నీ వ్రాసి వుంటాయి. దారిలో ఏ అధికారి అయినా బండి ఆపితే, అప్పటి కప్పుడు పర్మిట్ మీద తేది వేస్తారు. దానితో ఆ రవాణా సక్రమమై పోతుంది. ఆపనంత కాలం ఆ పర్మిట్ అదే బండితో పోతూ, వస్తూ వుంటుంది. దీని వల్ల ప్రభుత్వానికి తీవ్ర నష్టం. రాయల్టీ కట్టినప్పుడే పర్మిట్లు వస్తాయి. ఒకే పర్మిట్ మీద వందల వాహనాలలో రవాణా జరగడం వల్ల ప్రభుత్వానికి రావల్సిన రాయల్టీ రూపాయికి పైసా లెక్కన కూడా రావడం లేదు.


అనుమతిలేని పొట్టేపాళెం రేవులో తాత్కాలిక రోడ్డు ఏర్పాటుతో ఇసుకను ట్రక్కులోకి నింపుతున్న దృశ్యం.

### స్వర్ణముఖిలో కూడా అదే దుర్మార్గం

పెన్నా నదితో పాటు స్వర్ణముఖి కూడా ఇసుక స్మగ్లర్ల ధాటికి నాశనమై పోతున్నది. నాయుడుపేటకు చెందిన అన్ని పార్టీల రాజకీయవాదులూ ఇసుక అక్రమ రవాణాలో భాగం పంచుకొంటున్నారు. రోజూ వందలాది వాహనాలలో ఇసుకను మద్రాసుకు తరలిస్తున్నారు.

### మద్రాసులో లారీ 80వేలు

మద్రాసులో ఇసుక ధర వింటే గుడ్లు గుండ్రంగా తిరుగుతాయి. ఒక్క క్యూబిక్ ఫీట్ ఇసుక ధర 80 రూపాయలు పలుకుతున్నదక్కడ. ఒక్క యూనిట్‌కు 100 క్యూబిక్ ఫీట్లు. అంటే యూనిట్ ధర 8వేలు. పెద్ద లారీలలో పది యూనిట్ల వరకు రవాణా జరుగుతుంది. అంటే ఒక్క లారీ ఇసుక 80వేల రూపాయలకు విక్రయిస్తున్నారన్న మాట.

### సిలికాకు ఎక్కడలేని గిరాకీ

మద్రాసు ధర ఆకాశానికి ఎగబ్రాకడంతో ఇసుక స్మగ్లర్లు రకరకాల మార్గాలలో వ్యాపారం చేస్తున్నారు. అందులో ఒకటి సముద్ర తీర గ్రామాలలో దొరికే సిలికా ఇసుక. ఈ ఇసుక కట్టుబడికి పనికిరాదు. గాజు ఫ్యాక్టరీలు, ఉక్కు ముద్దలు తయారు చేసే కొలిములు వంటి వాటికి మాత్రమే వాడుతారు. దానితో అది చాలా చవకగా, టన్ను 150 రూపాయలకే దొరుకుతుంది. ఇసుక స్మగ్లర్ల కళ్లు ఇప్పుడు సిలికా ఇసుక మీద పడ్డాయి. టన్ను 300 రూపాయల వరకు ధర పెంచి, వందలాది లారీలలో మద్రాసు పొలిమేర్లకు తరలిస్తున్నారు. నెల్లూరు నుంచి తెచ్చిన పెన్న లేదా స్వర్ణముఖి ఇసుకను, దీన్ని కలుపుతున్నారు. కొందరైతే కంకర క్వారీలలో దొరికే దుమ్మును కూడా కొంత భాగం కలుపుతున్నారు. అట్లా మిశ్రమం చేసిన ఇసుకను మద్రాసు భవన నిర్మాణాల వద్ద అమ్ముతున్నారు. సిలికా ఇసుకలో ఉప్పు శాతం అధికంగా వుంటుంది. దానితో భవనాలు కడితే, కాంక్రీటు లోపలున్న ఇనుప ఊచలు పది పన్నెండేళ్లలోపలే తుప్పు పట్టి, బలహీన పడి, భవనాలు కూలిపోయే ప్రమాదం వుంది. కానీ కట్టుబడికి ఇసుక అనేది దొరకక పోవడంతో భవన నిర్మాతలు, పాతిక ముప్పై అంతస్తులు కట్టేవారు కూడా ఈ సిలికా కలిసిన ఇసుకను కొని, వాడుతున్నారు. ఈ దుర్మార్గాన్ని ఆపకుంటే మద్రాసు నగరం భవిష్యత్తులో చాలా నష్టపోతుంది. మొత్తం మీద నెల్లూరు జిల్లాలో ఇసుక అక్రమ వ్యాపారం వెయ్యి తలల విష నాగు వలె విశ్వరూపం ప్రదర్శిస్తున్నది. వూరికే వచ్చే డబ్బు వదులుకోవడం ఎందుకంటూ దురాశతో ఆనం సోదరులు తమ అధికార దర్పాన్ని ప్రదర్శించి, ఈ దుర్మార్గానికి అండగా నిలుస్తున్నారు. నెల నెలా కోట్లాది రూపాయలు మూట కట్టుకొంటున్నారు.

## కలెక్టర్, ఎస్పీలు కళ్లున్న కబోదులు

మద్రాసుకు జరిగే ఇసుక రవాణాకు మరహదారి పొదలకూరురోడ్డు. పెన్న రేవుల నుంచి నెల్లూరు దాటాలంటే ట్రాఫిక్ తక్కువగా వుండే రోడ్డు అదొక్కటే. రాత్రి అయితే చాలు, ఆ రోడ్డు మీద వందలాది లారీలు, వేలాది ట్రాక్టర్లు రొద పెడుతూ ప్రయాణిస్తుంటాయి. జిల్లా కలెక్టర్ గారి బంగళా, ఎస్పీ గారి ఇల్లు వుండేది ఈ రోడ్డు మీదనే. తమ తమ ఇళ్లలో, పడక గదులలో పవళించి వున్నా సరే, ఈ లారీల రొద వారి చెవిన పడక తప్పదు. తలెత్తి బయటకు చూస్తే ఆ లారీలు కన్పించకా మానవు. కానీ ఇద్దరికి ఇద్దరూ కళ్లున్న కబోదుల వలె, చెవులున్న బధిరుల వలె, నోరున్న మూగవారి వలె ప్రవర్తిస్తున్నారు. ఇంత దుర్మార్గంగా, ఇంత దౌర్జన్యంగా, ఇంత దోపిడీ తత్వంతో జిల్లా నుంచి ఇసుక అక్రమ రవాణా జరుగుతుంటే అటు కలెక్టర్ గారు కానీ, ఇటు ఎస్పీ గారు కానీ ఉలకడం లేదు, పలకడం లేదు. వారిద్దరూ తలచుకొంటే ఒక్క లారీ పొలిమేర దాటదు. ఒక్క ట్రాక్టర్ పెన్న రేవులో దిగలేదు. ఇసుక స్మగ్లర్లతో వారికి సంబంధం వున్నదని కానీ, వాటాలున్నాయని కానీ మేము ఆరోపించడం లేదు. ఎస్పీగారు చాలా పద్ధతైన అధికారి. దైవభక్తి మెండు. నిజాయితీకి పేరుపడిన వాడు. తిరుమల దేవస్థానంలోనే ఎన్నో ఒత్తిళ్లను ఎదుర్కొని డాలర్ల కుంభకోణాన్ని వెలికి తీసిన నిజాయితీపరుడు. నిష్కల్మష మానసుడు. కానీ ఏమి లాభం? ఆయనకు తన విధుల మీద శ్రద్ధ లేదు. తన చేతిలో వున్న అధికారాన్ని వాడుకొనే చొరవ లేదు. దానితో ఆయన వున్నా లేనట్లే వుంది పరిస్థితి. కలెక్టర్ గారికి మంత్రులు, ఎమ్మెల్యేలంటే వెన్నులో చలి. వారికి ఎదురు చెప్పే సాహసం ఆయనలో అణుమాత్రం లేదు. వారికి సంబంధించిన వ్యవహారాలంటే ఆమడ దూరంలో నిలబడి కళ్లు మూసుకొంటాడాయన.

వీరిద్దరిది అలసత్వం అనాలో, అశ్రద్ధ అనాలో తెలియదు కానీ, దాని వల్ల నెల్లూరు జిల్లా ఘోరంగా నష్టపోతున్నది. పెన్నా నదిలో బావుల వంటి గుంటలు త్రవ్వడం వల్ల భూగర్భ జలాలు అడుగంటి పోతున్నాయి. సముద్రం నీళ్లు ముందుకు చొచ్చుకొని వచ్చేస్తున్నాయి. ఈ ప్రకృతి విధ్వంసాన్ని ఆపకపోతే, సముద్రానికి దాదాపు పది కిలోమీటర్ల దూరం వరకు పంట పొలాలు ఎందుకూ పనికి రాని బీళ్లుగా మారడం ఖాయం. తాత్కాలికంగా తమకొచ్చే కోట్ల రూపాయల అక్రమ సంపాదనకు ఎమ్మెల్యేలు, వారిని ఎదిరించలేని అసహాయతలో జిల్లా అధికారులు కలిసి నెల్లూరుజిల్లా గ్రామీణ ప్రజలకు ఎన్ని తరాలైనా పూరించలేని ద్రోహం చేస్తున్నారు. ఇది క్షమించరాని నేరం.


మాజీ కార్పొరేటర్ ఆనం జయకుమార్‌రెడ్డి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని ఆయన నోరు తీపి చేస్తున్న అనుచరుడు శివకుమార్. ప్రక్కన ఆనం విజయకుమార్‌రెడ్డి తదితరులున్నారు.

# అమావాస్యకు, పితృదేవతలకు మధ్య సంబంధం!



చాంద్రమానం ప్రకారం కృష్ణపక్షంలో వచ్చే పదిహేనవ తిథి అమావాస్య. దీని అధిదేవత చంద్రుడు. సాధారణంగా నెలకు ఒక అమావాస్య లెక్కన ఏడాదికి పన్నెండు అమావాస్యలు వస్తుంటాయి. అమావాస్య అనగా చీకటి రోజని అర్థం. ఆనాడు చంద్రుడు కన్పించడు. అమావాస్యలన్నింటిలోకి శ్రావణ, భాద్రపద, ఆశ్వీయుజ మాసాల్లో వచ్చే అమావాస్యలు విశిష్టమైనవి. అమా తిథిలో సూర్యచంద్రులు కలిసిపోయి వుంటారు. కాబట్టి ఆ పేరు వచ్చింది. తిథులు అనగా చంద్రుడి కళలు. వీటిలో అమావాస్య, పౌర్ణమి అంటే అందరికీ తెలిసినవే. ఆకాశంలో సూర్యచంద్రులు ఎదురెదురుగా 150 డిగ్రీల దూరంలో వుంటే దీనిని పూర్ణిమ అని, ఇద్దరూ కలిసి వుంటే దానిని అమావాస్య అని అంటారు. అమావాస్య, పూర్ణిమ రోజుల్లో తిథుల్ని శుక్లపక్షం, కృష్ణపక్షంగా పిలుస్తారు. అమావాస్య నుంచి పున్నమి వరకు వచ్చే తిథుల్ని శుక్లపక్షం అని, తిరిగి పున్నమి నుంచి అమావాస్య వరకు వచ్చే తిథుల్ని కృష్ణపక్షం లేదా బహుళపక్షం అని అంటారు. కృష్ణ అనగా నల్లనిది, శుక్ల అంటే తెల్లనిది అని అర్థం. అందుకే అమావాస్య, పూర్ణిమ తిథులకు ఆ పేర్లు వచ్చాయి.

అమావాస్యకు, పితృదేవతలకు వున్న సంబంధం గురించి అనేక పురాణాలు తెలియజెప్పాయి. పితృదేవతలకు ప్రీతికరమైన అమావాస్య నాడు వారిని కొలిస్తే సకల సంపదలు చేకూరుతాయని చెప్తారు. అమావాస్య ఎలా ఏర్పడింది. పితృదేవతలు ఎవరు అనే దానిపై మత్స్యపురాణం పద్నాల్గవ అధ్యాయంలో వివరించబడి వుంది. పితృదేవతలు అనే వారిని ఏడు గణాలుగా చెప్తారు. వీరిలో మూడు గణాల వారికి ఆకారం వుండదు. వీరు నిర్వికారులు. అగ్నిష్వాత్తులు, బద్విషదులు, వైరాజులు ఈ కోవలోకి వస్తారు. ఆకారం కల్గిన గణాలు నాలుగు. వారు సుఖాలినులు, హవిష్మంతులు, సోమపులు, ఆజ్యవులు. ఈ ఏడు గణాల వారు ప్రాణులలో సామర్థ్యాన్ని, చైతన్యాన్ని కల్గిస్తుంటారు. ఆకారంలేని పితరులు వైరాజుడు అనే ప్రజాప్రతి కుమారులు. వీరు శాశ్వత లోకాలను పొందదలచి యోగసాధనకు ఉపక్రమించి, ఏకాగ్రత లేని కారణంగా మధ్యలోనే భ్రష్టులవుతారు. ఆకారణంగా వీరంతా పితృదేవతలుగా మారారు. వీరి మానస పుత్రికే మేన. ఆమె హిమవంతుడిని పెళ్లాడింది. వారికి ముగ్గురు కుమార్తెలు, ఒక కుమారుడు. మైనాకుడు కుమారుడు కాగా, ఉమ, ఏకపర్ణ, అపర్ణ అనే వారు కుమార్తెలు. వీరిలో పెద్దదైన ఉమను రుద్రుడికి, రెండవ కుమార్తె ఏకపర్ణను భృగుడికి, అపర్ణను జైగీషవ్యుడికి ఇచ్చి వివాహం చేశారు. వీరంతా వైరాజ పితృదేవతల సంతతి వారు. సోమపథాలు అనే లోకంలో మరీచి అనే ప్రజాప్రతికి జన్మించిన పితృదేవత గణాలు నివసిస్తుంటాయి. వీరిని దేవతలు సైతం ఆరాధిస్తుంటారు. వీరికి అచ్ఛోద అనే మానస పుత్రిక వుంది. నదీ రూపంలో వుండే అచ్ఛోదను ఏదైనా వరం కోరుకోమనగా సుందరాకృతిలో వుండే మానసుడు అనే పితరున్ని మోహిస్తుంది. ఇంద్రియ నిగ్రహాన్ని కోల్పోయి వావి వరసలు మరచి పితృదేవతనే ప్రేమించిన కారణంగా యోగశక్తి నశించిపోయేలా వారు శపిస్తారు. మావసుడు మాత్రం ఇంద్రియ నిగ్రహంతో ప్రవర్తించాడు. ఆనాటి నుంచి అచ్ఛోద అమావాస్య అయింది. అంటే మావసుడుకి ప్రియురాలు కానిది అని అర్థం. తర్వాతి కాలంలో అచ్ఛోదకే అమావాస్య అని పేరొచ్చింది. ఆనాడు పితృదేవతలను పూజిస్తే వారు తమ మానస పుత్రిక మీద వుండే మమకారంతో అనంత ఫలితాన్ని ఇస్తారని విశ్వాసం.

అమావాస్యలన్నింటిలోకి మహాలయ అమావాస్య, సోమవార అమావాస్య, దీపావళి అమావాస్య, పోలాల అమావాస్య, చుక్కల అమావాస్యలు ముఖ్యమైనవి. మహాలయ అమావాస్యనగా భాద్రపద బహుళ పాడ్యమి నుంచి అమావాస్య వరకు వున్న 15 రోజులు. అలాగే సోమవారాల్లో వచ్చే అమావాస్యను సోమవార అమావాస్య, సర్వ అమావాస్య అని పిలుస్తారు. ఆశ్వీయజంలో వచ్చే అమావాస్యను దీపావళి అమావాస్య అంటారు.

సభలు - సమావేశాలు

# జీవిత సత్యాలను తెలిపే మహాభారతం!

తెలుగు భాష ఎంతో మధురమైన భాష. అలాంటి భాషకు తల్లిలాంటిది పద్యం అని అన్నమాచార్య ప్రాజెక్టు డైరెక్టర్, అవధాన పండితుడు మేడసాని మోహన్ తెలియజేశారు. పద్యకళాపరిషత్ ఆధ్వర్యంలో టౌన్‌హాలులో ఆంధ్ర మహాభారతంలోని వివిధ పర్వాలపై ఆయన ఉపన్యాసం ప్రారంభించారు. సెప్టెంబర్ మూడు నుంచి ప్రారంభమైన ఈ ఉపన్యాసాలు ఏడవ తేదీ వరకు నాలుగు రోజులపాటు జరుగనున్నాయి. ఈ కార్యక్రమం ప్రారంభించిన అనంతరం మోహన్ తనదైన శైలిలో మహాభారతంలోని పద్యాలు, అందులోని అంతరార్థాలను అందరికి అర్థమయ్యేలా వివరించారు. తెలుగుభాషను సుసంపన్నం చేసిన ఘనచరిత్ర పద్యానికి వుందన్నారు. తెలుగు సాంస్కృతిక ఊపిరిగా పద్యాన్ని అభివర్ణించారు. పద్య ప్రక్రియకు వేయి సంవత్సరాల చరిత్ర వుంటే, తెలుగు భాషకు రెండువేల సంవత్సరాల చరిత్ర వుందన్నారు. అంతటి ఘన చరిత్ర గల తెలుగు భాష, పద్యం నేడు కొంత వెనుకబడుతున్న తరుణంలో, ప్రజలకు దూరమవుతున్న పరిస్థితుల్లో పద్యకళాపరిషత్ ఇలాంటి కార్యక్రమాలను ఏర్పాటు చేయడం అభినందనీయమన్నారు.

మహాభారతం జ్ఞానాన్ని-విజ్ఞానాన్ని అందించే గొప్ప కావ్యమన్నారు. ధర్మ, అర్థ, కామ, మోక్షాలైన చతుర్వేద పురుషార్థాలను తెలుసుకోవడంతోపాటు వాటిని ఎలా జయించాలో మహాభారతం చెపుతోందన్నారు. అది భారతం మనకు ప్రసాదించిన గొప్పవరమన్నారు. మహాభారతాన్ని రచించిన తిక్కన అందులో తక్కువ పదాల ద్వారా ఎక్కువ అర్థాన్నిచ్చేలా రచన చేయడం ఆయన గొప్పతనమన్నారు. ఈ పద్యాలను చదువుతుంటే వాటి ద్వారా ఆయన తెలుగు భాషను ఎలా రక్తికట్టించారో అర్థమవుతుందన్నారు. ప్రతి పద్యం వెనుక ఒక సందేశం వుంటుందని, మహాభారత గ్రంథం లోతుల్లోకి వెళ్తే అడుగడుగునా ఒక్కో రహస్యం అవగతమవుతుందన్నారు. ఎన్నో జీవిత సత్యాలను, సమాజానికి, మనుషుల నడవడికకు పనికొచ్చే ధర్మసూత్రాలు తెలుస్తాయని, వాటిని తెలుసుకొని ఆచరించడం ద్వారా మనిషి తన జన్మను సార్థకం చేసుకోవచ్చన్నారు.

కష్టాల్లో వున్నప్పుడు ఆత్మస్థైర్యంతో ముందుకు నడిచి విజయాన్ని సాధించవచ్చని మహాభారతం తెలుపుతుందన్నారు. పాండవులు అరణ్యవాస సమయంలో వున్నప్పుడు మహర్షులు వారికి ఈ హితబోధ చేశారన్నారు. భారతాన్ని వ్రాసిన ఎర్రన అంతకు ముందే రామాయణ కావ్యాన్ని వ్రాసి వున్నారని, చారిత్రక ఆధారాలు దీనిని రుజువు చేస్తున్నాయన్నారు. దురదృష్టవశాత్తు కాలగర్భంలో కావ్యాలు, గ్రంధాలు కలసి పోవడంతో చరిత్రకు కన్పించడం లేదన్నారు. ఎర్రన మహాభారతంలో పదేపదే రామాయణాన్ని స్తుతించి వున్నారన్నారు. అరణ్యవాసం చేసేటప్పుడు కష్టాలను ఎదురీది ఎలా పోరాడాలో మహర్షులు రామాయాణాన్ని ఉదహరిస్తూ పాండవులను చెప్పడాన్ని ఆయన ప్రస్తావించారు. ఎన్ని కష్టాలు ఎదురైనా ఆత్మస్థర్యాన్ని కోల్పోరాదనేది మహాభారతం చెపుతోందన్నారు. ఇక ఉద్యోగపర్వం ఉత్తర, అభిమన్యుల కళ్యాణంతో ఆరంభమవుతుందన్నారు. ఈ కార్యక్రమంలో పద్యకళాపరిషత్ నిర్వహకులు మెట్టు రామచంద్రప్రసాద్, బలరామయ్యనాయుడు, ఎస్ఆర్‌కె స్కూల్ అధినేత కృష్ణమూర్తి తదితరులు పాల్గొని ప్రసంగించారు. ఈ వేదికకు ఆచార్య బద్రిరాజు కృష్ణమూర్తి వేదికగా పేరు పెట్టారు.




డాక్టర్ మేడసాని మోహన్‌ను సన్మానిస్తున్న బివి.నరసింహం, ఎస్ఆర్‌కె స్కూల్ అధినేత కృష్ణమూర్తి, మెట్టు రామచంద్రప్రసాద్, బలరామయ్య నాయుడు.



రాష్ట్రంలో 287 దేవస్థానాల ప్రతిష్టాపనాచార్యుడు కొత్తపల్లి సురేష్‌శర్మను సన్మానిస్తున్న పద్యకళా పరిషత్ నిర్వాహకులు.




తలపెట్టిన పనులలో తరచూ ఆటంకాలేర్పడి చీకాకు కలిగిస్తాయి. వృత్తి, వ్యాపార రంగాలలో వారికి ఆర్థిక నష్టాలు, రాణింపు వుండదు. అకారణ ప్రయాణాలు, అధిక ఖర్చులు ఏర్పడతాయి. ఇంట్లో భార్యాభర్తల మధ్య స్పర్ధలు, చిక్కులు, చీకాకులుంటాయి. ఉద్యోగులకు పై అధికారుల వల్ల ఇబ్బందులుంటాయి. వ్యవసాయదారులకు పనులలో చిక్కులు ఏర్పడి ఆర్థికమాంద్యం ఏర్పడగలదు.




పనులు ఆశించనంతగా జరగవు. ప్రతి వ్యవహారం మీకు ప్రతికూలంగా వుంటుంది. కాని అనుకోని ధనాదాయం కొంత ఊరటనిస్తుంది. కొన్ని సంతోషవార్తలు వినడం వల్ల మనశ్శాంతి ఏర్పడగలదు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారులు అనుకూలత సాధించగలరు. విద్యార్థులకు సంతోషవార్తలు వినడం, ప్రయాణ లాభాలు. వ్యవసాయ రంగంలోని వారికి అప్రయత్న లాభాలు.




చేసే పనులన్నీ నెరవేరి లాభదాయకంగా వుంటుంది. నూతన పనులను ప్రారంభించుటకు అనుకూలం. జీవిత భాగస్వామితో ప్రయాణాలు, సేవా కార్యక్రమాలలో పాల్గొనడం వుంటుంది. వృత్తి, వ్యాపారాలలోని వారికి చక్కని అభివృద్ధి, ఆర్థికాదాయం, బాకీలు వసూలగుట వుంటుంది. ఉద్యోగులు పై అధికారుల గుర్తింపు పొందుతారు. కళా, క్రీడా రంగాల వారికి ప్రయాణాలలో సౌఖ్యం.




తలపెట్టిన పనులు సకాలంలో పూర్తి చేస్తారు. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికాదాయం వుంటుంది. శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. ప్రయాణాల వల్ల లబ్ధి. ఉద్యోగులకు అధికారుల వల్ల లాభాలు, స్పెక్యులేషన్ లాభిస్తుంది. కుటుంబ సౌఖ్యం. విద్యార్థులు సంతోషంగా వుంటూ విందు, వినోదాలలో పాల్గొంటారు. వ్యవసాయ రంగంలోని వారికి చేసే పనులలో కష్టాలున్నా ఆర్థికంగా నిలదొక్కుకోగలరు.




గ్రహానుకూలతల వల్ల అనుకూల వాతావరణమేర్పడి, అన్ని పనులు సకాలంలో పూర్తవుతాయి. వృత్తి, వ్యాపార రంగాలందు రాణింపు, ఆర్థికాదాయం వుంటుంది. భూగృహ నిర్మాణ కార్యాలు తలపెట్టుట జరుగుతుంది. విద్యార్థులు చక్కని ప్రతిభను కనపరుస్తారు. వ్యవసాయంలో అధిక ఖర్చులున్నా ఆదాయం బాగుంటుంది. రాజకీయవాదులు స్వల్ప వివాదాలు ఎదుర్కొనుట, స్థానచలనాలుంటాయి.




ఈ రాశివారు కొంత గ్రహానుకూలతలు కలిగి ఆగిన పనులన్నీ సకాలంలో పూర్తి చేసుకోగలరు. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థికాదాయాలు సంతృప్తినిస్తాయి. చేసే వ్యవహారాలు కలిసి వస్తాయి. ఉద్యోగులకు ప్రయాణాలలో బడలిక, శారీరక బాధలుంటాయి. కుటుంబ విషయాలు అనుకూలిస్తాయి. కోర్టు వ్యవహారాలలో లాభాలు. భూ సంబంధ వ్యవహారాలు కలసి వస్తాయి.

# వారఫలాలు

*తేది 08-09-2012 నుండి 14-09-2012 వరకు వృషభంలో గురు, కేతువులు; కర్కాటకంలో శుక్రుడు; సింహంలో రవి, బుధులు; 11తేది నుంచి బుధుడు కన్యలో; తులలో కుజ, శనులు; వృశ్చికంలో రాహువు; వృషభ, మిధున, కర్కాటక, సింహాలలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

12తేది కమలేకాదశి.
14తేది మాసశివరాత్రి.

### శుభ ముహూర్తాలు

అధిక భాద్రపదమాసం శూన్యమాసం కావడంతో వివాహాది శుభకార్యాలకు ముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య శుభకార్యాలకు సుముహూర్తాలున్నాయి.

### సెప్టెంబరు తిథులు
### అధిక భాద్రపద బహుళ

| | | | | | |
|---|---|---|---|---|---|
| 8 | శని | అష్టమి | | పూర్తిగా | |
| 9 | ఆది | అష్టమి | ఉ | 07.54 | గం.ల.వ |
| 10 | సోమ | నవమి | ఉ | 09.57 | గం.ల.వ |
| 11 | మంగళ | దశమి | ప | 11.22 | గం.ల.వ |
| 12 | బుధ | ఏకాదశి | ప | 12.03 | గం.ల.వ |
| 13 | గురు | ద్వాదశి | ప | 11.57 | గం.ల.వ |
| 14 | శుక్ర | త్రయోదశి | ప | 11.07 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.




పనులలో తరచూ ఆటంకాలు, వృత్తి, వ్యాపార రంగాల వారి ఆర్థికాదాయం తగ్గుట, అధిక ఖర్చులుంటాయి. ఉద్యోగులు ఏ పని తలపెట్టినా వాయిదాపడుట, మనోదుఃఖం వుంటాయి. విద్యార్థులు ప్రతి చిన్న విషయానికీ కృంగి, ఆందోళన చెందగలరు. వ్యవసాయదారులకు సామాన్య ఫలితాలు, ఆదాయానికి మించిన ఖర్చులుంటాయి. కళా, క్రీడా రంగాలలోని వారు నమ్మినవారి వల్ల దగా పడగలరు.




తలపెట్టిన పనులలో మిశ్రమ ఫలితాలు వుంటాయి. శరీరారోగ్య లోపంతో వృత్తి, వ్యాపారాలలోనివారు రాణించలేరు. ఔషధ సేవలు అవసరం. కుటుంబ సౌఖ్యం, సంతోషవార్తలు వినడం, ఉద్యోగులు పై అధికారుల వల్ల ఏర్పడిన సమస్యల నుండి బయటపడడం జరుగుతుంది. విద్యార్థులు నిరాశ, నిస్పృహలతో వుంటారు. రాజకీయులకు మాట నేర్పరి తనం మంచిది.




పనులలో సమయం వృధా అయినా నిలకడగా పూర్తవుతాయి. వస్తు, సమయ నష్టాలధికంగా వుంటాయి. మీపై వ్యతిరేకత కూడా వుంటుంది. దైవ, ఆధ్యాత్మిక సేవలలో పాల్గొంటారు. ప్రయాణ సౌఖ్యం. వృత్తి, వ్యాపారాలలో అనుకున్న ఆదాయం వుంటుంది. ఉద్యోగులకు శరీర అలసట, ఉద్రేకం వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారి మాటకు విలువ పెరిగి వృత్తులలో రాణిస్తారు.




గతవారం కన్నా మెరుగ్గా వుంటుంది. తలపెట్టిన పనులు పూర్తి చేయగలరు. వృత్తి, వ్యాపారాలలోని వారు బాగా రాణించగలరు. ఆర్థికాదాయం బాగుంటుంది. కుటుంబ సౌఖ్యం, నూతన పరిచయాలు, శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. విద్యార్థులకు ఆరోగ్య భంగం, శత్రుభయ. వ్యవసాయదారులు చేసే పనులు కలసి వస్తాయి. కళా, క్రీడా రంగాల వారి సమస్యలు తీరి, వ్యవహారనుకూలత వుంటుంది.




పనులన్నీ సకాలంలో పూర్తౌతాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ఆర్థికాదాయం, వ్యవహార విజయం. నూతన వస్తు, వాహనాలు సమకూర్చుకొంటారు. విద్యార్థులు చదువుపై శ్రద్ధ పెడతారు. వ్యవసాయదారులు ధైర్యంగా వుండడంతో ఆర్థికాదాయం కలిసొస్తుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి స్త్రీ సౌఖ్యం, విందులు వినోదాలలో పాల్గొంటారు. రాజకీయులు ఆధిపత్య నిరూపణకు ఆరాటపడతారు.




తలపెట్టిన పనులు పరవాలేదనిపిస్తాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థికాదాయాలు సామాన్యంగా వుండి అవసరానిరి రుణాలు చేస్తారు. ఇతరులతో మాట్లాడు నప్పుడు వివాదాలు రాకుండా జాగ్రత్త వహించండి. కుటుంబంతో సఖ్యతగా వుండగలరు. అనవసర ఖర్చులధికం. ఇతరులకు హామీలివ్వవద్దు చిక్కులేర్పడతాయి. వ్యవసాయదారులకు ఆదాయానికి మించిన ఖర్చులుంటాయి.

# అరవై నాలుగు కళల్లో 'అంతర్భాగం' వాస్తుశాస్త్రం!

*డాక్టర్ సి.పర్వతరాజు — బెంగుళూరు*

** వాస్తుశాస్త్ర విభాగాలకు చతుష్షష్ఠి కళా విభాగాలలో ఏ సంఖ్యనిచ్చారు?*

ప్రాచీన గ్రంథం "సంజ్ఞా దర్పణం"లో అరవై నాలుగు కళల్లో వాస్తు శాస్త్రాన్ని చేర్చి దానికి నలభై ఆరవ స్థానాన్నిచ్చారు. ఆ తర్వాతి శాస్త్రాలు శిల్ప, భరత, యోగ శాస్త్రాలు.

*డి.జయశంకరసూర్య — హైదరాబాద్*

** 'జయపృచ్ఛ' గ్రంథాన్ని గురించి విన్నారా? నేను వాస్తు విద్యార్థిని. వివరణలివ్వండి?*

ఇది ప్రాచీన వాస్తు గ్రంథాలలో అతి ప్రాచీనమైనది. అయితే వీటి వ్రాతప్రతులు అసమగ్రంగా లభించాయి. ఇందులో సైనిక, పౌర, గృహస్థ వాస్తు సూత్రాలున్నాయి.

*పి.అనంతనారాయణ — గూడూరు*

** రత్నధారణ చేసిన తర్వాత సమస్యలు పెరిగాయి.*

స్వంత వైద్యం ఎప్పుడూ పనికిరాదు. ఎవరైనా రెండు రాళ్లు మాత్రమే ధరించాలి. నవరత్న ఉంగరం ధారణ వలన ఉపయోగం లేకపోగా నష్టాలే ఎక్కువ.

*డాక్టర్ డి.నరసింహాచార్యులు — చెన్నై*

** వాస్తు శాస్త్ర ప్రస్తావనలు ఏ పురాణంలో ఉన్నాయి? అవి ఎన్ని గ్రంథాలు?*

మత్స్యపురాణంలో వాస్తు శాస్త్ర ప్రవక్తలు పదునెన్మిది అని ప్రస్తావన ఉంది. భృగువు, అత్రి, వశిష్ఠుడు మొదలు వాసుదేవుడు, విశాలాక్షుడు, బృహస్పతి, అనిరుద్ధుడు వరకు వ్రాసిన అష్టాదశ వాస్తు శాస్త్రోపదేశకుల ప్రస్తావనలున్నాయి.

*వై.వి.తులసి — ఉదయగిరి*

** తూర్పు, దక్షిణ ద్వారాలున్నాయి. ఫలితాలెలా ఉంటాయి?*

తూర్పు, పశ్చిమ ద్వారాలు మంచిది. తూర్పు, దక్షిణ ద్వారాలు స్త్రీహాని, సమస్యాత్మకమని భృగు సంహిత చెబుతోంది.

*సి.భారతీమహదేవన్ — బెంగుళూరు*

** భారతదేశం మొత్తం వాస్తు ఒకటేనా? వేరు వేరుగా ఉన్నాయా?*

వింధ్య, కృష్ణ, తుంగభద్రల వరకు మయ, కృష్ణ, తుంగభద్రల దిగువ ప్రాంతాలలో భృగు, ఉత్తర భారతదేశంలో కశ్యపవాస్తు విధాన, విభాగాలున్నాయి.

*ఎం.భరత్‌శంకరశాస్త్రి — అనంతపురం*

** నేను దేవాలయ శిల్పశాస్త్రాన్ని అధ్యయనం చేయాలనుకొంటున్నాను. మీ సూచనలనివ్వండి?*

మీరు ఆగమ శాస్త్ర పాఠశాలల్లో చేరండి. సమరాంగణ సూత్రధారణ మీకు ఉపయోగపడే గ్రంథం. ఇందులో శిల్ప, ఆలయ విభాగాల అధ్యయన విశ్లేషణలు 83 అధ్యాయాలుగా ఉన్నాయి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ప్రదీప్‌కుమార్‌రాజు — తిరుపతి*

** భారతదేశంలోని వాస్తు గ్రంథాలలో ప్రామాణికమైనవేవి?*

భారతీయ వాస్తు గ్రంథాలలో యాభైకి పైగా ప్రామాణికమైన వాస్తు గ్రంథాలున్నాయి. ఆధునిక వాస్తు గ్రంథాలు ప్రామాణికమైనవి కావు.

*డి.నారాయణస్వామి — పొదలకూరు*

** దేవాలయాల వాస్తు బాగులేకపోతే ఆకర్షణ ఉండదా?*

గృహ వాస్తులాగే దేవాలయాలకు ఆగమ శాస్త్ర విధివిధానాలున్నాయి. ఎందులోనైనా లోపాలున్నప్పుడు సమస్యలు, పరిణామాలు ఉంటాయి.

*వి.ముకుందస్వామి — నారాయణవనం*

** తిరువెంబూరులో అద్భుత విగ్రహాలను చూశాను. ఆగమ శాస్త్ర వివరణలు మీరు అధ్యయనం చేశారా?*

మా పాఠ్యాంశంలో వాస్తు, జ్యోతిష, ఆగమ, హిందూ ధర్మశాస్త్రాలుండేవి. కాబట్టి నేను కొంత వరకు అధ్యయనం చేశాను. తిరుచ్చి సమీపంలోని 'ఆదిత్య భట్టరర్' ఆలయమది. ఆలయంలోని పృష్ఠ, దేవకోష్ఠములలో ఉన్నది 'హరిహరమూర్తి' విగ్రహం.

*వై.ఊర్మిళ — సికింద్రాబాద్*

** 'నాడీ జ్యోతిషం' చూపించాక స్థితి యధా పరిస్థితిగానే ఉంది.*

ఆ జ్యోతిష విషయం కొన్ని కుటుంబాల గుప్పిట్లో ఉన్నది. శాస్త్రజ్ఞులు దాన్ని నమ్మడం లేదు. జ్యోతిష, శాస్త్రజ్ఞుల సలహాలు తీసుకోండి.

### • కలువాయి సొసైటీలో

# ఆరేళ్ల తర్వాత బయటపడ్డ అవినీతి భాగోతం!

**సహకార శాఖలో పనిచేసే ఇద్దరు ఉద్యోగులు తెలివైన పథకంవేసి బినామీ పేర్లతో రైతులకు వ్యవసాయ రుణాలు అందించినట్లు రికార్డుల్లో చూపి 25 లక్షల రూపాయలు 2005 సంవత్సరంలో స్వాహా చేశారు. ఈ వ్యవహారం పసిగట్టిన మరో ఉద్యోగి చేసిన ఫిర్యాదు ఆధారంగా విచారణ జరపగా ఈ విషయం నిజమని ఇటీవలే తెలిసివచ్చింది.**

**ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘాలు రైతులకు అవసరమైన రుణాలు అందించాలి. అయితే కలువాయి సొసైటీలో రుణాలు అందించకుండానే అందించినట్లు రికార్డులో నమోదుచేసి దాదాపు 25 లక్షల రూపాయలు స్వాహా చేసిన సంఘటన ఆలస్యంగా వెలుగులోకి వచ్చింది.**

వివరాల్లోకి వెళితే... కలువాయి మండలంలోని కుల్లూరు, పర్లకొండ గ్రామాల ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘాలను 2005 సంవత్సరంలో కలువాయి సొసైటీలో విలీనం చేశారు. మండలం మొత్తాన్ని ఒకే సొసైటీగా ఏర్పాటుచేసి రైతులకు రుణాలు అందించాలని అధికారులు నిర్ణయించారు. అయితే కలువాయి సొసైటీలో విలీనం కాకముందే కుల్లూరు సొసైటీలో ఇద్దరు ఉద్యోగులు రాజారావు, శంకరయ్యలు తమ ఇష్టానుసారంగా వ్యవహరించారు.

బినామీ పేర్లతో రైతులకు వ్యవసాయ రుణాలు అందించినట్లు చూపి 25 లక్షల రూపాయలకు పైగా రుణాన్ని వీరిద్దరూ పంచుకున్నారు. అప్పటి నుంచి ఆ ఇద్దరు ఉద్యోగులు తమ అవినీతి భాగోతం బయటకు పొక్కకుండా జాగ్రత్తపడుతూ వచ్చారు. 2005 సంవత్సరంలో పర్లకొండ సొసైటీతోపాటు కుల్లూరు సొసైటీ కూడా కలువాయి సొసైటీలో విలీనం కావడంతో తమ బండారం ఎక్కడ బయట పడుతుందోనన్న భయం వారిలో చోటుచేసుకొంది. విలీనంలో పర్లకొండ సొసైటీ నుంచి కలువాయి సొసైటీలోకి వచ్చిన ఉద్యోగి వెంకటేశ్వర్లుపై అవినీతి ఆరోపణలు చేసి సాగనంపి తమకు అడ్డులేకుండా చేసుకున్నారన్న ఆరోపణలున్నాయి. అప్పట్లో దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ప్రకటించిన పంట రుణాల మాఫీ పథకం కింద కలువాయి సొసైటీలో కోటి 57 లక్షల రూపాయలు రద్దయ్యాయి.

ఇందులో రాజారావు, శంకరయ్యలు గతంలో కుల్లూరు సొసైటీలో బినామీ పేర్లతో తీసుకున్న 25 లక్షల రూపాయలు సైతం రుణ మాఫీ కింద రద్దుకాబడ్డాయి. ఈ విషయాన్ని పసిగట్టిన ఉద్యోగి వెంకటేశ్వర్లు కలువాయి సొసైటీలో 40 లక్షల రూపాయలు గోల్మాల్ జరిగిందంటూ ఉన్నతాధికారులకు ఫిర్యాదు చేయడంతో రుణ మాఫీ కథ ముగిసిందనుకున్న వారి అవినీతి డొంక కదిలింది. ఉన్నతాధికారుల ఆదేశాల మేరకు రాపూరు కో–ఆపరేటివ్ డివిజనల్ అధికారి చిన్న అంకయ్య పది రోజులపాటు రైతుల వద్ద సుదీర్ఘ విచారణ జరిపి రాజారావు, శంకరయ్యల అవినీతిపై 300 పేజీల నివేదిక తయారుచేసి అధికారులకు సమర్పించాడు. అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటున్న ఇద్దరిలో రాజారావు పొదలకూరు కో–ఆపరేటివ్ బ్యాంకులో సూపర్‌వైజర్‌గానూ, శంకరయ్య కలువాయి సొసైటీలో గుమస్తాగా పనిచేస్తున్నారు.

నివేదిక ఆధారంగా పాలకవర్గం తీర్మానాల ద్వారా విధుల నుంచి పై ఇద్దరిని తొలగించడం జరిగింది. రైతులకు పంపిణీచేసే ఎరువుల్లో కమీషన్లకు కక్కుర్తి పడుతున్నాడన్న ఆరోపణపై శంకరయ్యను గతంలో ఒకసారి ఉన్నతాధికారులు సస్పెండ్ కూడా చేశారు. ఇటీవల రైతులకు పంపిణీ చేయాల్సిన యూరియాను బ్లాక్ మార్కెట్‌కు తరలించాడన్న ఆరోపణలు ఉన్నాయి. విధుల నుంచి తొలగించిన ఇద్దరిపై "డొమెస్టిక్ ఎంక్వైరీ" చేపట్టి స్వాహాచేసిన 25 లక్షల రూపాయలను తిరిగి రికవరీ చేసేందుకు సిద్ధమవుతున్నారు అధికారులు. ప్రస్తుతం కలువాయి సొసైటీలో ఉద్యోగులు లేక ఖాళీగా దర్శనమిస్తుంది. గతంలో ఈ సొసైటీలో పనిచేస్తూ సస్పెండ్ అయిన సూర్యనారాయణరాజు(సూరి) అనే ఉద్యోగికి బాధ్యతలు అప్పగించనున్నట్లు సమాచారం. మొత్తంమీద రుణమాఫీ జరిగిన ఆరు సంవత్సరాల తర్వాత సొసైటీలో బినామీ పేర్లతో రుణాలు పొందిన విషయాన్ని అధికారులు గుర్తించడం విశేషం.

**నానాపాట్లు**

### • సాంఘిక సంక్షేమ

# హాస్టళ్లలో పరిస్థితులు అధ్వాన్నం!



సవాలక్ష సమస్యలున్న కొండాయపాళెంగేటు వద్దనున్న ప్రభుత్వ బాలుర వసతి గృహం.

**"సాంఘిక సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో జిల్లాలో 149 హాస్టళ్లు నడుస్తున్నాయి. వీటిలో 49 ప్రైవేటు భవనాల్లో కొలువై ఉన్నాయి. ఇక్కడ కనీస వసతులు లేక విద్యార్థినీ, విద్యార్థులు నానాపాట్లు పడుతున్నా పట్టించుకునే వారేలేరు."**

విద్యా సంవత్సరం ప్రారంభమై మూడు నెలలు కావస్తున్నా జిల్లాలోని హాస్టళ్లకు సరఫరా చేయాల్సిన అత్యవసర వస్తువులు ఇంకా చేరలేదు. దీంతో సాంఘిక సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో నడిచే హాస్టళ్లలోని విద్యార్థులు ఇబ్బంది పడుతున్నారు. విద్యార్థులు ఇబ్బంది పడుతున్న విషయాన్ని ఉన్నతాధికారులకు తెలియజేసినా పెద్దగా స్పందించడం లేదు. ట్రంకు పెట్టెలు, బక్కెట్లు, స్కూల్ బ్యాగ్స్, సింథటిక్ మ్యాట్లు, ప్రతి సంవత్సరం కొత్తగా చేరే విద్యార్థులకు అందించాలి. 2011 – 12 సంవత్సరంలో కొంతమేర సరఫరా చేసిన అధికారులు ఈ సంవత్సరం వీటిని సరఫరా చేయడం మరిచిపోయినట్లున్నారు.

సాంఘిక సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో 149 హాస్టళ్లు ఉన్నాయి. వీటిలో బాలురకు 95 హాస్టళ్లు, బాలికలకు 54 హాస్టళ్లు ఏర్పాటు చేశారు. ఈ హాస్టళ్లను రెండు భాగాలుగా విభజించి విద్యార్థులకు ప్రవేశాలు కల్పించారు. 3వ తరగతి నుంచి 7వ తరగతి వరకు, 8 నుంచి పదవ తరగతి వరకు హాస్టళ్లను విభజించారు. ఈ వంద హాస్టళ్లు ప్రభుత్వ భవనాల్లో ఉండగా మిగిలిన 49 ప్రైవేటు భవనాలను అద్దెకు తీసుకుని నిర్వహిస్తున్నారు. హాస్టళ్లలో సదుపాయాలు లేక ప్రధానంగా బాలికలు ఇబ్బందులు పడుతున్నారు. వీటి నిర్వహణకు ప్రభుత్వం ఏటా కోట్ల రూపాయలు విడుదల చేస్తున్నా వాటిని సక్రమంగా వినియోగించలేక పోతున్నారు అధికారులు.

ఈ సంవత్సరం హాస్టళ్లలో ప్రవేశాలు పొందిన వారికి అవసరమైన ట్రంకు పెట్టె, బక్కెట్, చాప, దుప్పట్లు ఇంటి దగ్గర నుంచి తీసుకురావాలని వార్డెన్లు చెబుతున్నారు. ప్రభుత్వం నుంచి అత్యవసర వస్తువులు సరఫరా కాలేదని చెబుతున్నారు. తప్పనిసరి పరిస్థితుల్లో విద్యార్థుల తల్లితండ్రులు వీటిని కొనుగోలు చేసి తీసుకు వస్తున్నారు. హాస్టళ్లలో కేవలం నోటు పుస్తకాలు అందజేసి చేతులు దులుపుకున్నారు. అధికారులు, ప్రజాప్రతినిధులు నిర్వహించే సభలు, సమావేశాల్లో మాత్రం హాస్టల్ విద్యార్థులకు అవసరమైన అన్ని సదుపాయాలు కల్పిస్తున్నట్లు ప్రకటిస్తుంటారు. వాస్తవ పరిస్థితులకు, అధికారులు చెబుతున్న దానికి పొంతన ఉండదు. వార్డెన్లు, మ్యాట్రిన్లు హాస్టళ్ల నిర్వహణ బాధ్యతలను వంట పనిచేసే వారికి, సర్వెంట్లకు అప్పగించి సొంత పనులపై వెళుతున్నారు. ప్రభుత్వ నిబంధనల ప్రకారం ఉదయం ఆరు గంటల నుంచి 9.30 వరకు, మధ్యాహ్నం 12 గంటల నుంచి 2 గంటల వరకు, సాయంత్రం 6 గంటల నుంచి రాత్రి 9.30 వరకు వార్డెన్లు, మ్యాట్రిన్లు విధులు నిర్వహించాల్సి ఉంటుంది.

అయితే విద్యార్థులకు ఉదయం, రాత్రి భోజనానికి అవసరమైన రేషన్, ఇతర సరుకులు వంట వారికి అందజేసి జిల్లా కార్యాలయానికి వెళుతున్నట్లు చెప్పి పత్తా లేకుండా పోతున్నారు. హాస్టల్ విద్యార్థులకు మధ్యాహ్న భోజనం వారు చదివే పాఠశాలలో సరఫరా చేస్తుండడంతో మధ్యాహ్నం పూట హాస్టళ్లలో భోజనం తయారు చేయాల్సిన అవసరం లేకుండా పోయింది. హాస్టళ్లపై సంబంధిత శాఖ అధికారుల పర్యవేక్షణ పూర్తిగా లోపించింది. సంక్షేమ శాఖల పనితీరును పర్యవేక్షించేందుకు జిల్లాస్థాయి అధికారులతో "టాస్క్‌ఫోర్స్"ను ఏర్పాటు చేసినప్పటికీ పనిభారం అధికం కావడంతో వారు మండలాల్లో సక్రమంగా పర్యటించలేక పోతున్నారు. ప్రతి శుక్రవారం మండలాల్లో పర్యటించి హాస్టళ్లలోని లోపాలపై జిల్లా కలెక్టర్‌కు నివేదిక అందజేయాల్సి ఉంటుంది. టాస్క్‌ఫోర్స్ అధికారులు సమర్పించిన నివేదికలపై కలెక్టర్ స్పందించక పోవడంతో హాస్టళ్లను, ఇతర పథకాలను తనిఖీ చేసేందుకు వీరు ఆసక్తి చూపడం లేదు. కోట్ల రూపాయలు ఖర్చుచేసి నిర్వహిస్తున్న సంక్షేమ శాఖల హాస్టళ్లను పట్టించుకోకపోతే ప్రభుత్వ సంకల్పం నెరవేరకుండాపోయే అవకాశం ఉంది.

# సాదా సీదా శ్రీమన్నారాయణ!



✍ అల్లూరు రహీం

రికార్డులు కొట్టాలన్నా మేమే. వాటిని తిరగ రాయాలన్నా మేమే... అని సింహా చిత్రంలో హీరో బాలకృష్ణ చెప్పిన డైలాగును ఆయన అభిమానులు మర్చిపోరు. శ్రీమన్నారాయణ పాటల విడుదల వేడుకలోనూ బాలకృష్ణ మరోసారి ఈ రికార్డుల ప్రస్తావన తీసుకొచ్చాడు. రికార్డులు సృష్టించడానికే శ్రీమన్నారాయణ చిత్రం చేశానన్నాడు. కొత్తదనాన్ని కోరుకొనే ప్రతి ఒక్కరికీ ఈ చిత్రం నచ్చుతుందని, తన తండ్రి మహానటుడు ఎన్టీరామారావు తన కెరీర్‌లో పోషించని జర్నలిస్ట్ పాత్రను ఈ చిత్రంలో తాను చేశానని గొప్పలకు పోయాడు. కాని ఎల్లో ఫ్లవర్ పతాకంపై రమేష్ పుప్పాల నిర్మాతగా వ్యవహరించి తీసిన శ్రీమన్నారాయణ చిత్రంలో చెప్పుకోతగ్గ ప్రత్యేకతలేమీ లేవు. సాదాసీదా చిత్రమిది. ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు నిర్వహించిన రవికుమార్ చావలికి రెండు మూడు చిన్న చిత్రాలు తీసిన అనుభవం మాత్రమే వుంది. ఆయన తనకున్న తెలివి తేటలతో రెండు పంచ్ డైలాగులు, ఒక ఫైట్, ఇంకో పాట, ఓ సెంటిమెంట్ సీన్. ఓ విలన్ చావు ఫార్ములాతో రీళ్లు చుట్టేశాడు. చిత్రం ఆరంభంలో మాత్రం బాలకృష్ణ జీ–టీవీలో జర్నలిస్ట్‌గా కనపడతాడు. ఆ తర్వాత అంతా జైలు; మారువేషాల్లో విలన్లను చంపను సమయం సరిపోతుంది. ఈ చిత్రానికి పెద్ద మైనస్ పాయింట్ హీరోయిన్ పార్వతి మెల్టన్. ఒంటి మీద కండలేని ఈ భామ పాటల్లో జాతరలో మాతమ్మలా ఊగిపోతుంటుంది. ఎందుకిలా అని ప్రేక్షకులకు అర్థం కాదు. చక్రీ సంగీతం కూర్చిన పాటలు మాస్ మెచ్చేవే. కానీ ఈ సంగీతం పదేళ్ల క్రితం నాటి సినిమాల తరహాలో వుంటుంది. పైపెచ్చు పాటలు వెరైటీగా వుండాలని పంజాబీ గాయకుడు దలేర్ మెహందీ చేత పాడించారు. ఆయన తెలుగును ఖూనీ చేశాడు. పాటల చిత్రీకరణ కూడా దర్శకునికి చేతకాలేదు. ఘటికాచలం పంచ్ డైలాగులంటూ వ్రాసిన బాదడానికి బయోడేటా ఎందుకు? పెన్ కట్టుకోవడమే కాదు... గన్ పట్టుకోవడమూ తెలుసు. మూడొచ్చినప్పుడు ముచ్చట తీర్చుకోవాలి అనేవి అసలు డైలాగులా? సిబిఐను విమర్శిస్తూ హీరో పలికే ఒకే ఒక లెంగ్తీ డైలాగ్ మాత్రం బాగుంది. బాలకృష్ణ ముఖంలో ముడతలు కనపడకుండా ప్రత్యేక మేకప్ వేయించిన దర్శకుడు లక్ష్మీనరసింహస్వామి గెటప్‌లో ఆయన్ను వికారంగా ఎందుకు చూపాడో అర్థం కాదు. బ్యాంకుల్లో ఐదు వేల కోట్ల రూపాయలను ఆన్ లైన్‌లో డ్రా చేసి పారేస్తే ఆదాయపన్ను శాఖ, అంతర్జాతీయంగా బ్యాంకుల్లో అమౌంట్లు మార్పిడి చూసే శాఖలు వూరుకొంటాయా? చిత్రకథకు ప్రాణమైన ఈ పాయింట్ కూడా దర్శకుడు గజిబిజిగా తీసి పారెయ్యడం మాస్ ప్రేక్షకులను మాత్రమే గుర్తుంచుకోనని అర్థం చేసుకోవాలి.




చిత్రకథలోనికి వెళ్తే శ్రీమన్నారాయణ (బాలకృష్ణ) జీ–టీవీలో జర్నలిస్ట్. జైజవాన్ హౌసింగ్ స్కామ్‌లో వ్యవసాయ మంత్రి బైల్‌రెడ్డి (జయప్రకాష్‌రెడ్డి) పాత్రను రుజువు చేస్తాడు. దీంతో మాజీ సైనికులకు ఇళ్లప్లాట్లు వచ్చి వారంతా సంతోషిస్తారు. శ్రీమన్నారాయణ తండ్రి కల్కి నారాయణమూర్తి (విజయ్‌కుమార్) రైతు నాయకుడు. రాష్ట్రంలోని రైతుల కడగండ్లను చూడలేక జైకిసాన్ ట్రస్ట్ ఏర్పాటు చేసి వారిని ఆదుకోవాలని పిలుపునివ్వడంతో జనం ఐదువేల కోట్ల రూపాయలు విరాళాలుగా ఇస్తారు. వీటిని రాజన్ మొదలియార్ (కోట శ్రీనివాసరావు) ఛైర్మన్‌గా వుండే బ్యాంకులో డిపాజిట్ చేస్తారు. తన మంత్రి పదవి పోవడంతో శ్రీమన్నారాయణపై రగిలి పోతుండే బైల్‌రెడ్డి బావమరిది పులికేశవరెడ్డి (సుప్రీత్), డాక్టర్ శ్రీకర్‌ప్రసాద్ (నాగినీడు) ఐజి మార్తాండ్ (రావు రమేష్), అంతర్జాతీయ హవాలా బ్రోకర్ హర్షద్ (సురేష్)లతోపాటు బ్యాంకు ఛైర్మన్ సహకారంతో ఈ డిపాజిట్‌ను తెలివిగా కాజేస్తారు. ఓ విదేశీ బ్యాంక్‌కు ట్రాన్స్‌ఫర్ చేస్తారు. ఈ సమయంలో శ్రీమన్నారాయణ తన మరదలు భానుమతి (ఇషాచావ్లా)ను గుర్తు తెలియని వ్యక్తులు కిడ్నాప్ చేయగా వారివెంటబడతాడు. ఓ చోట అతను కారు ఆపి దిగే లోపల స్విస్ పాస్‌పోర్టు, విమానపు టిక్కెట్లు పెట్టేస్తారు. ఈ సమయంలోనే విలన్ గ్యాంగు బ్యాంకులో కల్కి నారాయణమూర్తిని చంపేస్తారు. డబ్బు కోసం శ్రీమన్నారాయణ తన తండ్రిని చంపేశాడని అందరూ నిందిస్తారు. జైలుకెళ్లే శ్రీమన్నారాయణ జైలర్ శంకరనాయక్(ఆహుతి ప్రసాద్) సహకారంతో రాజన్ మొదలియార్, డాక్టర్ శ్రీకర్‌ప్రసాద్‌లను చంపేస్తాడు. ఈ కేసు విచారణకు రంగంలో దిగిన సిబిఐ అధికారి జ్ఞానేశ్వర్ (వినోద్‌కుమార్) సైతం శ్రీమన్నారాయణకే మద్దతు ఇవ్వడంతో మొత్తం విలన్ గ్యాంగ్‌ను అంతమొందించి, చిన్న మెలికతో హీరో జైలు నుండి బయటపడతాడు. జైకిసాన్ ట్రస్ట్ రైతుల కోసం అంకితమవుతుందని చెప్పడంతో సినిమా ముగుస్తుంది.



## శృంగార తారగా చూడొద్దు!

బెంగాలీ భామ బిపాసాబసుకు బాలీవుడ్‌లో ఇంకా క్రేజ్ తగ్గలేదు. గత కొన్నేళ్లుగా సరైన విజయాలు లేకపోయినా... ఆమె నటిస్తున్న సినిమా వస్తుందంటే చాలు ప్రేక్షకుల్లో ఆసక్తి పెరిగిపోతుంది. 7వ తేదీ విడుదల కానున్న 'రాజ్–3'పై కూడా పెద్ద అంచనాలున్నాయి. విక్రమ్‌భట్ ఎంత భయపెట్టాడో చూద్దామని కాదు. బిపాసబసు ఎంత హాట్‌గా కనిపిస్తుందో తెలుసు కొందామని. అయితే తనను కేవలం ఐటెమ్ భామగానో, శృంగార తారగానో చూడొద్దని చెబుతోంది బిపాసా. శృంగార తారగా పిలిపించుకోవడం అదృష్టమే. కానీ ప్రతిసారి అదే దృష్టితో చూడొద్దు. కార్పొరేట్ సినిమాలో కళ్లతోనే భావాలు పలికించాననే సంగతి మర్చిపోవద్దు. అవకాశం రావాలేగానీ మంచి పాత్రల్లో నటించి ప్రేక్షకాభిమానం పొందుతానంటుంది బిపాస.

## సైనికుల మధ్య దీపికా!



హీరోయిన్ దీపికా పదుకొణేకు చాలా రోజులుగా దేశ సరిహద్దుల్లో సైనికుల మధ్య గడపాలనే ఓ కోరిక ఉండేదట. ఆగష్టు 15వ తేది సైనికుల మధ్య గడపను జమ్మూకెళ్లింది. సైనికులతో కలసి ముచ్చట్లు చెప్పింది. సైనికులు శిక్షణపొందే చోటుకు వెళ్లి రైఫిల్ వాడడం ఎలాగో తెలుసుకొంది. తన కెరీర్ గూర్చి సైనికులకు చెప్పింది. వారితో కలసి భోజనం కూడా చేసింది. ఈ విషయమై దీపిక మాట్లాడుతూ సైనికుల మధ్య గడిపిన రోజు నాకు ఎప్పటికీ గుర్తుండి పోతుంది. యుద్ధ ట్యాంకర్ నడిపాను. ప్రత్యేక శిక్షణ కేంద్రం దగ్గరికి వెళ్లి వాళ్లు తర్ఫీదు పొందుతున్న విధానాన్ని చూశాను. అక్కడ చాలా విషయాలు నేర్చుకొన్నానంటుందీ అందగత్తె. అయినా అందగత్తెలు ఏదిచేసినా అందమే.



## లోపమెక్కడో ?

కొత్త బంగారులోకం, రైడ్ చిత్రాల తర్వాత సరైన విజయం దక్కక హీరోయిన్ శ్వేతబసుప్రసాద్ సతమతమౌతోంది. తాజాగా మొదలైన చిత్రం విజేత షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడింది. తొలి అడుగులోనే కొత్త బంగారులోకంతో ఘన విజయం వచ్చింది. అవకాశాలు అందొచ్చాయి. అన్నీ హిట్ కావాలనే చేస్తాం. అయితే సత్ఫలితాలు దక్కలేదు. ఎక్కడ లోపం జరుగుతుందో తెలియడం లేదు. నా చిత్రాల ఎంపిక సరిగ్గానే ఉంటుంది. ఈ విషయంలో ఎప్పుడూ అలక్ష్యం చూపలేదు. కొత్త హీరోయిన్లు ప్రత్యేకించి ఏయే జాగ్రత్తలు తీసుకోవాలో అన్నీ ఆచరించా. గ్లామర్‌గా కనిపించేందుకు కూడా సిద్ధమేనంటుంది శ్వేతబసు ప్రసాద్. వి.నయన్ తీస్తున్న త్రిభాషా చిత్రంలో ఆమె ఐటమ్ పాటలోనూ నర్తిస్తోంది. చేతిలో తెలుగు చిత్రం ఒకటుండగా తమిళంలో మాత్రం మూడు చిత్రాల్లో నటిస్తుంది.

## నచ్చితేనే నటిస్తాను!



శ్రుతిహాసన్ హీరోయిన్‌గా నటించిన గబ్బర్‌సింగ్ చిత్రం కెవ్వుకేక పెట్టించింది. ఆమె సినీ జీవితంలో తొలి విజయమిది. ప్రస్తుతం హిందీ చిత్రం లక్‌లో నటిస్తుంది. ప్రభుదేవా దర్శకుడు. ఈ విషయాలు వివరిస్తూ హిందీ, దక్షిణాది రెండూ నాకు ముఖ్యమే. తమిళం, తెలుగు భాషల్లో మంచి అవకాశాలొస్తున్నాయి. జయాపజయాలు మన చేతుల్లో లేవనేది అందరూ చెప్పేమాట. సినిమా హిట్ అయితే నాపై మరింత బాధ్యత పెరిగిందనుకోవడం, ఫెయిల్ అయితే బాధ్యతలేదనుకోవడం సరైంది కాదు. మనం నటించిన సినిమా విజయం సాధించినా, పరాజయంపాలైనా నేను పోషించిన పాత్రపై ప్రేమ ఒకే విధంగా ఉంటుంది. ఎందుకంటే ఆ పాత్ర నా మనసుకు నచ్చి అంగీకరించాకే నేను తెరపై నటిస్తాను కాబట్టి అని చెప్పుకొచ్చింది శ్రుతిహాసన్.

## షిర్డీ సాయితో స్వాంతన!

నాలుగైదేళ్లకొకసారి భక్తిభావంతో కూడిన కథలు చెయ్యడం వ్యక్తిగతంగా స్వాంతన పొందిన అనుభూతి కలుగుతుందని హీరో నాగార్జున చెప్పారు. శిరిడిసాయి చిత్రంలో నటించడం తనను మానసికంగా కూడా ఎంతో ఆనందపరచిందన్నాడు. భవిష్యత్తులోనూ ఇలాంటి కథల్లో నటించే అవకాశం రావాలని కోరుకొంటున్నాను. ఒక పాత్ర నుంచి మరొక పాత్రలోనికి వెంటనే మారిపోవడం నాకు అలవాటే. నిన్నేపెళ్లాడుతా చిత్రీకరణ పూర్తయిందో లేదో అన్నమయ్యగా మారాను. ఇప్పుడూ అంతే. శిరిడిసాయి పూర్తయిన వెంటనే లవ్‌స్టోరీ చిత్రంలో లవర్‌బాయ్‌గా సిద్ధమై పోయానన్నారాయన.

# కులాన్ని కవచం చేసుకున్న రామలింగం!

మన డిఇఓ మహాముదురు



టక్కుటమార విద్యల్లో ఆరితేరిన జిల్లా విద్యాశాఖ అధికారి అవినీతి, అక్రమాలపై అటు ఉపాధ్యాయులు, ఇటు ప్రజాప్రతినిధులు ముప్పేట దాడి చేయడంతో ఆయన ఆత్మరక్షణలో పడ్డారు. ఈ గండం నుంచి గట్టెక్కేందుకు కులాన్ని అడ్డం పెట్టుకొన్నాడు. కొంతమందిని పోగేసి వెనుకబడిన తరగతులకు చెందిన వ్యక్తంటూ బిసి కార్డ్ ప్రయోగించాడు. మహిళా నేతలుగా చెప్పుకొంటూ పబ్బం గడుపునే వారిని, బిసి కుల సంఘం పేరు చెప్పుకొని తిరిగే వారిని చేరదీసి తనకు అనుకూలంగా ప్రకటనలు చేయిస్తూ, విలేకరుల సమావేశాలు పెట్టిస్తుండడం తీవ్ర విమర్శల పాలవుతుంది. గతంలో ఏ విద్యాశాఖాధికారి వ్యవహరించని విధంగా ఏకపక్షంగా వ్యవహరిస్తూ, కక్ష సాధింపులకు పాల్పడుతుండడమే కాక అధికారులెవరూ వ్యవహరించని విధంగా కులాన్ని అడ్డం పెట్టుకొని రాజకీయాలు చేయడాన్ని పలువురు ఖండిస్తున్నారు. బాధ్యతాయుతమైన పదవిలో ఉండి విద్యాశాఖను గాడిలో పెట్టాల్సింది పోయి కార్యాలయంలోనూ గ్రూపులను ప్రోత్సహిస్తూ భ్రష్టుపట్టించడమే కాక గతంలో తాను డిప్యూటీ డిఇఓగా పని చేసిన కాలంలో తన మాట వినని వారిపై ఇప్పుడు కక్ష సాధింపులకు పాల్పడడం విమర్శలకు దారి తీస్తుంది. కోవూరు మండలానికి చెందిన ఒక టీచర్‌ను సస్పెండ్ చేసినట్లు ఓ పత్రికలో వార్త వచ్చేలా చేశాడట. ఆ వార్త చూసిన ఆ టీచర్ ఆ పత్రికా విలేకరిని నిలదీయడంతో వారు డిఇఓను తప్పుడు సమాచారం ఎలా ఇస్తారని ప్రశ్నించడంతో దీనిని నిజం చేసేలా ఈ టీచర్‌ను సస్పెండ్ చేయడం చర్చనీయాంశమైంది. దీనిపై విచారణ కోరడంతో ఆ ప్రాంత ఉప విద్యాశాఖాధికారిని కాకుండా వేరే అధికారిని విచారణకు వేసి రెండు నెలల తర్వాత నాయుడుపేటలో పోస్టింగ్ ఇవ్వడం డిఇఓ కక్ష సాధింపు చర్యలను తెలియజేస్తోంది. ఇలాంటి చర్యలు ఇటీవల కాలంలో అధికం కావడం, ప్రైవేట్, కార్పొరేట్ పాఠశాలల యాజమాన్యాలతో లాలూచీ కుదుర్చుకొని వారికి అనుకూలంగా వ్యవహరిస్తుండడం, అయిన వారికి, ముడుపులు చెల్లించే వారికి ఒక రకంగా, కాని వారికి మరో రకంగా పక్షపాత వైఖరి అవలంభిస్తుండడం గబ్బు రేపుతోంది. పలుమార్లు ఎసిబి అధికారులకు దొరికినా, ఉన్నతాధికారుల నుంచి మొట్టికాయలు తిన్నా రామలింగంలో మార్పు రావడం లేదు.

# ఎస్సీ కార్పొరేషన్ ఎండి సమీక్ష!

## ప్రతి యూనిట్‌ను తనిఖీ చేశారు

రాష్ట్ర ఎస్సీ కార్పొరేషన్ మేనేజింగ్ డైరక్టర్ జయరాజ్ జిల్లా పర్యటనకొచ్చిన సందర్భంగా అధికారులతో సమీక్షా సమావేశం నిర్వహించారు. 2012 – 13 ఆర్థిక సంవత్సరానికి సంబంధించి జిల్లాలో అమలు చేయాల్సిన రుణ ప్రణాళికపై చర్చించడం జరిగింది. స్వయం ఉపాధి పథకాలు, భూమి అభివృద్ధి, భూమి కొనుగోలు పథకం, బ్యాంకు లింకేజీ రుణాలు, వివిధ వృత్తుల్లో శిక్షణ ఇప్పించడం వంటి వాటిపై అధికారులు, ఉద్యోగులు ప్రత్యేక దృష్టి సారించాలని ఆయన సూచించారు. రాష్ట్రవ్యాప్తంగా అన్ని ఎస్సీ కార్పొరేషన్‌లలో సిబ్బంది కొరత ఉందని, ఖాళీగా ఉన్న పోస్టులను భర్తీ చేసేందుకు త్వరలో చర్యలు తీసుకోనున్నట్లు చెప్పారు. ఈ సమావేశానికి ముందు ఎస్సీ కార్పొరేషన్ ద్వారా నగరంలో ఏర్పాటుచేసిన స్వయం ఉపాధి పథకాలు, కుట్టు శిక్షణ కేంద్రాలను పరిశీలించి లబ్ధిదారులతో మాట్లాడి సంతృప్తి వ్యక్తం చేశారు. 2వ తేది సెలవు దినం అయినా ఎస్సీ కార్పొరేషన్ ఎండి ఉద్యోగులతో సమీక్షా సమావేశం నిర్వహించడం పట్ల ఉద్యోగులు అసహనం వ్యక్తం చేశారు. దివంగత ఐఏఎస్ అధికారి సుబ్రహ్మణ్యం వర్ధంతి కార్యక్రమానికి హాజరైన ఎండి అధికారిక కార్యక్రమాలను నిర్వహించడం పట్ల దుమారం రేగడం విశేషం.




కార్పొరేషన్ రుణం పొందిన టైలరింగ్ సెంటర్‌లో ఎండి జయరాజ్.

# పెద్దాసుపత్రి నుంచి రక్తం తరలింపు!

## ఎన్నాళ్ల నుంచి ఈ అక్రమం జరుగుతుందో?

ప్రభుత్వ పెద్దాసుపత్రిలో గల బ్లడ్ బ్యాంక్ నుంచి రెండొందల యూనిట్ల రక్తాన్ని అక్రమంగా తరలించుక వెళుతూ పట్టుబడ్డారు ఇద్దరు వ్యక్తులు. వీరిలో ఒకడు అక్కడే ల్యాబ్ టెక్నీషియన్‌గా పనిచేస్తున్న ప్రదీప్. సెప్టెంబర్ 2వ తేది పొద్దుపోయిన తర్వాత బైక్‌పై వెళ్తున్న వీరిని మినీ బైపాస్ రోడ్డులో తెలుగుదేశం నేత కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి అనుచరులు అనుమానంతో ఆపి చూడగా వారి వద్ద అధిక సంఖ్యలో బ్లడ్ ప్యాకెట్లు కన్పించాయి. దీంతో వారు శ్రీనివాసులురెడ్డికి సమాచారం అందించడంతో ఆయన వచ్చి ఈ విషయాన్ని బ్లడ్ బ్యాంక్ ఇన్‌ఛార్జ్ డాక్టర్ కృష్ణమూర్తికి, ఇతర ఉన్నతాధికారులకు సమాచారం అందించారు. బ్లడ్ బ్యాంక్‌లో నిల్వ ఉండే అన్ని యూనిట్ల రక్తాన్ని ల్యాబ్ టెక్నీషియన్ ఎలా బయటకు తీసుకరాగలిగారు, దీని వెనుక ఎవరి పాత్ర ఉందన్న దానిపై పలు అనుమానాలు వ్యక్తమౌతున్నాయి. వీటిని అక్రమంగా తరలిస్తున్న ల్యాబ్ టెక్నీషియన్ ప్రదీప్‌ను దీనిపై ప్రశ్నించగా పొంతనలేని సమాధానాలు చెప్తుండడం అనుమానాలకు తావిస్తోంది. ఒంగోలులో గల హాస్పిటల్‌కు తీసుకెళ్తున్నామని ఒకసారి, డాక్టర్ చెబితేనే తీసుక వెళ్తున్నామని మరోసారి సమాధానం చెప్పడంతో పలువురు సందేహాలు వ్యక్తం చేస్తున్నారు. దీనిపై బ్లడ్ బ్యాంక్ ఇన్‌ఛార్జి కృష్ణమూర్తికి సమాచారం అందించగా ఆయన తాము ఎవరికీ బ్లడ్ సరఫరా చేయలేదని, అలా ఇచ్చినట్లైతే రికార్డులో నమోదు చేస్తామని చెప్పారు. అయితే ఆయన చెప్పిన సమాధానంలో స్పష్టత లేకపోవడం, సహజసిద్ధ ధోరణిలో తలాతోకలేని సమాధానాలు, గందరగోళ పరిచేలా జవాబు చెప్పడం పై వాటిని పట్టుకొన్న తెలుగుదేశం పార్టీ కార్యకర్తలు ఆగ్రహిస్తున్నారు. బ్లడ్ బ్యాంక్ ఇన్‌ఛార్జిగా ఉన్న వ్యక్తికి తెలియకుండా అంత పెద్ద సంఖ్యలో రక్తం ప్యాకెట్లు బయటికి వెళ్తున్నా ఆయన కనీసం స్పందించకుండా బాధ్యత లేకుండా ప్రవర్తించడం పైనా ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. ఈ వ్యవహారంపై కలెక్టర్ విచారణకు ఆదేశించారు. ఈ మేరకు 3వ తేది కమిటీలోని డాక్టర్ల బృందం పెద్దాసుపత్రిలోని బ్లడ్ బ్యాంక్‌ను సందర్శించి వివరాలు రాబట్టింది.

# గృహ నిర్మాణంలో వెనుకబడిన జిల్లా!

## మొదటి స్థానం నుంచి 21వ స్థానానికి దిగజారింది.

పేదలకు ఇళ్లు నిర్మించడంలో ఒకనాడు రాష్ట్రస్థాయిలో మొదటి స్థానంలో ఉన్న జిల్లా గృహ నిర్మాణ శాఖ నేడు చాలా వెనుకబడి పోయింది. అధికారులకు ఇళ్ల నిర్మాణాల్లో శ్రద్ధలేకపోవడం, సకాలంలో సిమెంటు, ఇసుక లబ్ధిదారులకు అందక పోతుండడంతో జిల్లాలోని వివిధ ప్రాంతాల్లో అధిక భాగం ఇళ్ల నిర్మాణాలు బేస్‌మెంట్ లెవల్లోనే నిలచిపోయి ఉన్నాయి. రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా చేపట్టిన ఇందిరమ్మ ఇళ్లు లబ్ధిదారులకు అందకుండా పోతున్నాయి. గృహ నిర్మాణ శాఖ ఉన్నతాధికారుల దగ్గర్నుంచి క్రిందిస్థాయి సిబ్బంది వరకు లంచాల మత్తులో మునిగి తేలుతుండడం, తమకు రావాల్సిన పర్సెంటీజీలు ఇతరత్రా వ్యవహారాల్లో చూపే శ్రద్ధ ఇళ్ల నిర్మాణాలపై పెట్టకపోవడంతో పేదలకు అన్యాయం జరుగుతోంది. దీంతో రాష్ట్రంలో ఒకప్పుడు మొదటి స్థానంలో ఉన్న గృహ నిర్మాణ శాఖ 21వ స్థానానికి పడిపోయింది. దీనిని బట్టే జిల్లాలో ఆ శాఖ పనితీరు ఎలా ఉందో అర్థమవుతుంది. ఉన్నతాధికారుల పర్యవేక్షణ కరువవడం, వర్క్ ఇన్స్‌పెక్టర్ల నుంచి తమకు రావాల్సిన నెల మామూళ్లను ఠంచనుగా వడ్డీ వ్యాపారుల్లాగా వసూలు చేసుకొని జేబులు నింపుకోవడం, డిఇ స్థాయి అధికారులైతే తమకు ప్రభుత్వం కల్పించిన వాహన సౌకర్యాన్ని ఆదాయ వనరుగా మార్చుకొంటున్నారు. ఆయా మండలాల ఎఇల నుంచి వాహనానికి డీజిల్ పట్టించుకొని, తిరిగి ప్రభుత్వం నుంచి బిల్లులు వసూలు చేసుకొంటుండడంతో వారి అవినీతికి అంతే లేకుండా పోతోంది. చివరకు తమ సొంత కార్యక్రమాలకు, పేరు కోసం నిర్మిస్తున్న ఆలయాలకు ఇసుక, సిమెంటు, స్టీల్‌ను క్రిందిస్థాయి సిబ్బంది నుంచి బలవంతంగా వసూలు చేస్తుండడంతో ఉన్నతాధికారులు తనిఖీకి వస్తున్నారంటేనే క్రిందిస్థాయి సిబ్బంది హడలి పోతున్నారు. వారికి రాచమర్యాదలు చేయడం దగ్గర్నుంచి వాహనాలకు డీజిల్, ఖర్చులకు డబ్బులు ఇవ్వాల్సి రావడంతో వారి బాధలు వర్ణనాతీతంగా ఉన్నాయి. మొత్తంమీద గృహ నిర్మాణ శాఖ సిబ్బంది పేదలకు ఇళ్ల నిర్మించడం ఎలా ఉన్నా తమ పబ్బం గడుపుకోవడంలో మాత్రం బిజీగా ఉంటున్నారు.

# ఆన్‌లైన్ రెన్యువల్ పాట్లు!



వివిధ కళాశాలల్లో ఇంటర్, డిగ్రీ ద్వితీయ సంవత్సరం చదువుతున్న విద్యార్థులు స్కాలర్‌షిప్పు రెన్యువల్ కోసం తీవ్ర ఇక్కట్లు పడ్డారు. మొదటి సంవత్సరం స్కాలర్‌షిప్పు పొందిన విద్యార్థులు ద్వితీయ సంవత్సరానికి సంబంధించి రెన్యువల్ చేయించుకోవాలని సాంఘిక సంక్షేమ శాఖ ఆదేశించింది. ప్రభుత్వ, ప్రైవేటు కళాశాలల ద్వారానే ఆన్‌లైన్ రెన్యువల్ చేయాలి. కొన్ని ప్రైవేటు కళాశాలలు విద్యార్థుల నుంచి ఫీజు వసూలుచేసి బయట ఇంటర్నెట్ కేంద్రాలను నిర్వహిస్తున్న వారికి రెన్యువల్ చేసే బాధ్యతను అప్పగించాయి. ప్రైవేటు కళాశాలల యాజమాన్యానికి తాము ఏ విధంగా తీసిపోమన్న ధోరణితో ప్రభుత్వ కళాశాలల ప్రిన్సిపాల్స్ కూడా ప్రైవేటు ఇంటర్‌నెట్ కేంద్రాల నిర్వహకులకు రెన్యువల్ చేసే బాధ్యతను అప్పగించేశారు. ఇందుకు ఒక్కో విద్యార్థి వద్ద 50 రూపాయల నుంచి 100 రూపాయల వరకు ఫీజుగా వసూలు చేసినట్లు తెలిసింది. ఆదాయ ధృవీకరణ పత్రంతోపాటు విద్యార్థికి సంబంధించిన పూర్తి వివరాలు ఆన్‌లైన్‌లో నమోదు చేయాల్సి ఉంటుంది. స్కాలర్‌షిప్పు రెన్యువల్ చేసే విద్యార్థులు ఒక తెల్ల కాగితంపై వివరాలు రాసి ఇంటర్‌నెట్ నిర్వాహకులకు అందించాలి. నమోదుచేసే సమయంలో ఏదైనా పొరపాటు దొర్లితే ఆ విద్యార్థికి స్కాలర్‌షిప్పు మంజూరు కాదు. బాధ్యతలేని వ్యక్తులకు ఆన్‌లైన్ రెన్యువల్ బాధ్యతలను అప్పగించడం ఎంతవరకు సమంజసమో కళాశాల ప్రిన్సిపాల్స్‌కే తెలియాలి.

## పెద్దాస్పత్రి

16వ పేజీ కొరవ

చాలా ప్రమాణాలున్నాయి. పత్రాలు ఉన్నాయి. కానీ ఆస్పత్రిలో పనిచేసే వారెవరో ఒక పథకం ప్రకారం రక్తాన్ని దొంగలిస్తున్నట్లు తెలుస్తున్నది. ఆస్పత్రిలో ఉండే పేద రోగులకు ఆపరేషన్లు చేసినప్పుడు, వారికి నాలుగైదు సంచుల రక్తం వాడినట్లు రికార్డులు సృష్టించి, వాటిని బయటకు తరలిస్తున్నారట. ఆస్పత్రి సిబ్బందికి ఒక్కొక్క సంచికి వెయ్యి రూపాయల వంతున ముడుతున్నదట. రోజూ వంద ప్యాకెట్ల వరకు ఇట్లా ఆస్పత్రి నుంచి దొంగతనంగా తరలి పోతున్నాయని అనుమానం.

ఇంత ఘోరమైన వ్యాపారం చేస్తూ, తెలుగుదేశం కార్యకర్తల అప్రమత్తత వల్ల దొంగలు దొరికితే, వారిని వెనకేసుకొని వస్తున్నారు అటు పోలీసులు, ఇటు ఎమ్మెల్యేలు శ్రీధర్‌కృష్ణారెడ్డి, ఆనం వివేకానందరెడ్డులిద్దరూ. తెలుగుదేశం నేత కోటం రెడ్డి శ్రీనివాసులురెడ్డి తమకు అప్పచెప్పిన దొంగల మీద తూతూ మంత్రం కేసులు పెట్టి, కోర్టులో ప్రవేశపెట్టి, వారిని రక్షించారు పోలీసులు. దారుణమైన రక్తం వ్యాపారం చేస్తున్నారన్న నేరాన్ని కేసులో ప్రస్తావించలేదు. అనుమానాస్పద వస్తువులు తరలిస్తున్నారనే సాధారణ నేరాన్ని మాత్రమే వ్రాశారు కేసులో. దానితో నెత్తురు త్రాగే ఆ ఇద్దరు దొంగలూ క్షేమంగా బయటపడ్డారు.

మరొక ప్రక్క ఎమ్మెల్యే వివేకానందరెడ్డి పత్రికా విలేఖరుల సమావేశం పెట్టి, వెటకారాలు మాట్లాడాడు. అర్థరాత్రి పూట మద్యం దుకాణాల వద్ద తెలుగుదేశం కార్యకర్తలకేమి పని, వారు మద్యం దుకాణాల వద్ద ఉండబట్టే కదా ఈ దొంగలను పట్టుకొన్నది అని ఎగతాళి చేశాడాయన. పెద్దాస్పతి బ్లడ్ బ్యాంక్ డాక్టర్లు, సిబ్బంది చాలా ఉత్తములని ఒక ఉచిత సర్టిఫికేట్ కూడా ఇచ్చేశాడు. దొరికిన దొంగలిద్దరినీ వదలి పెట్టమని పోలీసుల మీద ఒత్తిడి తెచ్చాడు.

అయితే జిల్లా కలెక్టర్ మాత్రం ఈ విషయాన్ని తీవ్రంగా పరిగణించి, డ్వామా ప్రాజెక్ట్ డైరక్టర్ శ్రీమతి గౌతమిని విచారణ అధికారిగా నియమించారు. ఆమె పెద్దాస్పత్రిలో బ్లడ్ బ్యాంక్ సందర్శించి, రికార్డులు స్వాధీనం చేసుకొని విచారణ జరుపుతున్నారు. ఆ రికార్డులు ఏవీ సక్రమంగా లేవని, రక్తం ఎవరికి ఇచ్చింది, ఎప్పుడు ఇచ్చింది అన్న వివరాలు అవకతవకగా ఉన్నాయని ఆమె ప్రాథమిక పరిశీలనలో తేలిపోయినట్లు తెలుస్తున్నది.

ఏది ఏమైనా ప్రాణాపాయంలో ఉన్న రోగులను కాపాడడానికి చిరంజీవి అభిమానుల వంటి మానవతావాదులు దానం చేస్తున్న రక్తాన్ని ఇంత నీచంగా, హేయంగా, దానవత్వంతో వ్యాపార సరకుగా మార్చడం ఘోరమైన నేరం. ఎస్పీ గారు మహా దైవ భక్తుడు. మానవత్వపు విలువలు తెలిసిన వారు. అన్ని విషయాల వలనే దీని పట్ల కూడా కళ్లు మూసుకొని, పట్టీ పట్టనట్లు ఉండకుండా, నిజమైన దోషులెవరో తేల్చడానికి నిజాయితీపరుడైన పోలీస్ అధికారికి విచారణ బాధ్యత అప్పచెప్పడం అవసరం. ఎమ్మెల్యే వివేకానందరెడ్డి గారు ఇంత ఘోరమైన, దారుణమైన విషయంలో కూడా హీన రాజకీయాలు చేయడం మానుకొంటే, దొంగలను వెనకేసుకొని వచ్చే దుర్భుద్ధి మానుకొంటే నెల్లూరు ప్రజలకు ఎంతో ఉపకారం చేసిన వారౌతారు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

ఖవ్వాలి, విరహ గీతాలు, డ్యూయెట్లు, మెలోడి పాటలు, దేశభక్తి గీతాలు శ్రోత లను వీనులవిందు చేశాయి. కర్నూలు ఇబ్రహీం, కడప ఎస్‌ఎం బాష, నెల్లూరు గాయకులు కలీముల్లా, గౌస్‌బాష, ఎండి అస్లాం, సుజాత, శిరీష, అమల కూడా మధుర గానాలాపన చేశారు. సినీనటుడు నాగేంద్రబాబును మహమ్మద్ రఫి స్మారక అవార్డుతో సన్మానించాడు నిర్వాహకుడు జాకీర్ హుస్సేన్. జంట ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డితోపాటు వర్షంలోనూ పెద్ద సంఖ్యలో మహమ్మద్ రఫి అభిమానులు ఈ కార్యక్రమానికి హాజరయ్యారు.

### సరస్వతినిధికి విరాళం!

నెల్లూరు సరస్వతినగర్‌లోని డాక్టర్ కిషోర్స్ రత్నం స్కూళ్ల నిర్వాహకుడు డాక్టర్ కె.కృష్ణకిషోర్ సరస్వతినిధికి 25వేల రూపాయల విరాళాన్ని 1వ తేది జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డికి ఆయన బంగ్లాలో అందించారు. గత ఏడాది కూడా 50వేల రూపాయలను డాక్టర్ కృష్ణకిషోర్ సరస్వతినిధికి విరాళంగా ఇచ్చారు. ఈ కార్యక్రమంలో రత్నం స్కూళ్ల జనరల్ మేనేజర్ రామ్మూర్తినాయుడు, ప్రిన్సిపాళ్లు తుహీనా, సంయుక్త, విద్యార్థులు పాల్గొన్నారు.

### డాక్టర్ రామచంద్రారెడ్డి అమెరికా నుంచి వచ్చేశాడు

సింధూర నర్సింగ్ హోమ్ వైద్యుడు డాక్టర్ జి.రామచంద్రారెడ్డి గారు నెల రోజులపాటు అమెరికా పర్యటన ముగించుకొని నెల్లూరు తిరిగి వచ్చేశారు. 7వ తేది నుంచి ఆస్పత్రిలో రోగులకు అందుబాటులో ఉన్నారు. రామచంద్రారెడ్డి గారు అపర ధన్వంతరి వంటి వైద్య శిఖామణి. ఆయన చెయ్యి పట్టుకొని చూస్తే మైక్రోస్కోప్‌లకు, స్కానింగ్ మిషన్లకు కూడా దొరకని రోగం బయటపడి పోతుంది. రోగ నిర్ధారణలో ఆయన వంటి నైపుణ్యం కల్గినవారు చాలా అరుదుగా వుంటారు. నెల రోజుల విరామం తర్వాత వైద్య సేవ ప్రారంభించిన డాక్టర్ రామచంద్రారెడ్డి గారికి హార్థిక స్వాగతం చెప్తున్నాము.

### చినుకులు రాలాయి!

బంగాళాఖాతంలో ఉపరితల ఆవర్తం మూలంగా రాష్ట్రవ్యాపితంగా మంచి వర్షాలు కురువగా జిల్లాలో మాత్రం 1, 2 తేదీల్లో చినుకులు రాలాయి. ఈ చినుకులు మనకు దేనికీ కొరగావు.

### కోలా కృష్ణమోహన్ విచారణ!

దేశంలో, రాష్ట్రంలోనూ పలువురిని మాయ చేసి మోసగించిన కోలా కృష్ణమోహన్ నెల్లూరులో విజయా లాండ్రీ ఏర్పాటు పేరిట నిరుద్యోగులకు కోటి రూపాయలకు పైగా కుచ్చు టోపీ పెట్టాడు. విజయవాడ పోలీసుల అదుపులో ఉండిన ఈ మోసగాడ్ని విచారణ నిమిత్తం నెల్లూరు తీసుకొచ్చిన పోలీసులు న్యాయమూర్తి అనుమతితో తమ కస్టడీకి తీసుకొని 2,3 తేదీల్లో విచారించారు. మహా మాయగాడు పోలీసులకు ఏమి చెప్పాడో విచారించి చెప్పాల్సిందే.

### ఘంటసాల స్వరార్చన!

నెల్లూరు సుబేదారుపేట లోని వెన్నెలకంటి రాఘవయ్య గిరిజన హాస్టల్ ఆడిటోరియంలో 2వ తేది కేతా అంకులు మెమోరియల్ ట్రస్ట్ ఆధ్వర్యంలో ఘంటసాల స్వరార్చన కార్యక్రమం జరిగింది. పాటూరు శ్రీనివాసులు, విరుగు సుబ్రహ్మణ్యం, దుర్గం మధుసూదన్, మంగళగౌరి, సుధావాణి, ప్రభావతమ్మ మధుర గానం చేయగా పెంచలయ్య తబలా, కీబోర్డుపై శ్రీనివాసాచారి సహకరించారు. ఈ కార్య క్రమంలో కేతా సుబ్బారావు, యనమల నాగేశ్వరరావు యాదవ్, ఆర్వీ శేషయ్య నాయుడు, బి.వి.నరసింహం తదితరులు పాల్గొన్నారు.

### సీమాంధ్ర విద్యార్థి కార్యాచరణ కమిటీ!

సీమాంధ్ర యువజన, విద్యార్థి ఐక్య కార్యాచరణ కమిటీ 2వతేది నెల్లూరు ఆమని ఫంక్షన్ హాలులో సమావేశమయ్యింది. దీనిలో పాల్గొన్న అన్ని సంఘాలు ఏకగ్రీవంగా సీమాంధ్ర యువజన, విద్యార్థి కార్యాచరణ కమిటీ రాష్ట్ర కన్వీనర్‌గా ముక్కు రాధాకృష్ణను ఎన్నుకొన్నారు. రాధాకృష్ణ పూర్వాశ్రమంలో బిజెపిలో ఉండేవాడు. ఆ తర్వాత రాజీవ్ భవన్ ఇన్‌ఛార్జ్‌గా పనిచేశాడు. ఇప్పుడు కొత్త సంఘానికి నాయకుడయ్యాడు.

### అల్లూరు కాలేజిలో డైనింగ్ హాల్ ప్రారంభం!

అల్లూరు రామకృష్ణ జూనియర్ కాలేజి ప్రాంగణంలో 34 లక్షలు వ్యయపరచి నిర్మించిన డైనింగ్ హాలును కరస్పాండెంట్ అల్లంపాటి విజయవర్ధన్ రెడ్డి 3వ తేది ప్రారంభించారు. రెండస్తులుగా నిర్మించిన ఈ డైనింగ్ హాలులో రెండు వేల మంది విద్యార్థులు ఒకేసారి భోజనం చేయవచ్చు. అల్లూరుకు చెందిన మేడా రామసుబ్బారెడ్డి తన కుమార్తె, కాలేజి పూర్వ విద్యార్థిని అయిన సురేఖ స్మృత్యార్థం 15 లక్షలు, మేడా రఘురామిరెడ్డి తన తల్లితండ్రులు రమణారెడ్డి, యశోదమ్మ జ్ఞాపకార్థం మరో 15 లక్షల రూపాయలు విరాళం ఇవ్వగా మిగతా మొత్తం కరస్పాండెంట్ విజయవర్ధన్‌రెడ్డి భరించడంతో ఈ డైనింగ్ హాలు అద్భుతంగా రూపుదిద్దుకొంది. ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథులుగా కళాశాల పూర్వ విద్యార్థులు ఉండేల మాలకొండారెడ్డి, కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు హాజరయ్యారు. ప్రస్తుత ప్రిన్సిపాల్ మేడా రామకృష్ణారెడ్డి, పాత ప్రిన్సిపాళ్లు మరుపూరు రత్నం, మేడా రమణారెడ్డి తదితరులు ఈ కార్యక్రమాన్ని పర్యవేక్షించారు.

### పేద విద్యార్థికి చేయూత!

నవలాకులతోటలోని శిశుమందిర్ పాఠశాలలో ఒక పేద విద్యార్థికి ఈ యేడాది చదువు నిమిత్తం 2500 రూపాయల నగదును స్కూల్ కరస్పాండెంట్ గుర్రం కృష్ణమూర్తికి లయన్స్ క్లబ్ ఆఫ్ నెల్లూరు పినాకినీ ఉపాధ్యక్షుడు బి.వి. మురళి అందించారు.

### నాబార్డ్ నిధుల స్వాహారాయుడు అరెస్ట్

ఐఆర్‌డిఎస్ స్వచ్ఛంద సంస్థ సిఇఓగా వ్యవహరిస్తూ ఆ సంస్థ నిధులు కోటి మూడు లక్షల రూపాయలను దారి మళ్లించి దుర్వినియోగం చేసిన ధర్మాన గోపాలరావును నెల్లూరు క్రైం పోలీసులు 4వ తేది పట్టుకొన్నారు. ఈయన వద్ద నుంచి 70 లక్షల రూపాయలపైగా విలువ చేసే ఆస్తులు, నగదు, ఐదు ఇంటి స్థలాలకు సంబంధించిన డాక్యుమెంట్లు, ఖరీదైన కారు, బంగారు నగలను స్వాధీనం చేసుకొన్నట్లు సిసిఎస్ సిఐ వీరాంజనేయ రెడ్డి చెప్పారు. ఉదయగిరి, మర్రిపాడు మండలాలలో నాబార్డు ప్రాజెక్ట్‌లో భాగమైన వాటర్ షెడ్ పథకం నిధులను గ్రామ కమిటీ ఛైర్మన్ల సంతకాలతో ఉదయగిరి, మర్రిపాడు బ్యాంకుల నుంచి డ్రా చేశాడీ ప్రబుద్ధుడు. గూడూరు, నాయుడుపేట, రేగడి చెలిక గ్రామాలలో బినామీ పేర్లతో ఇంటి స్థలాలు కొన్నాడు. కారును సైతం బంధువుల పేరుతో రిజిస్ట్రేషన్ చేశాడు. భార్యకు ఈ డబ్బులోనే బంగారు నగలు కొనిచ్చాడు. ఉదయగిరి పోలీస్ స్టేషన్‌లో నిధుల దుర్వినియోగంపై కేసులు నమోదు కావడంతో పారిపోయాడు. సిసిఎస్ సిఐ ఈ వ్యవహారంపై ప్రత్యేక శ్రద్ధపెట్టి ధర్మాన గోపాలరావును అరెస్ట్ చేశారు. ఈ స్వాహారాయుడ్ని పట్టిన వీరాంజనేయరెడ్డి బృందానికి ఎస్పీ రివార్డులు ప్రకటించారు.

### 108లో ప్రసవం

ఇందుకూరుపేట మండలం ఆదెమ్మసత్రంకు చెందిన పద్మజ అనే గర్భిణి 108 వాహనంలోనే ఆడపిల్లను ప్రసవించింది. గిరిజన కాలనీలోగల ఆమెను ప్రసవం కోసం 108 వాహనంలో నెల్లూరు ఆస్పత్రికి తీసుకెళ్తుండగా మార్గమధ్యంలో బిడ్డకు జన్మనిచ్చింది. 108 సిబ్బంది ప్రాథమిక చికిత్స చేసి ఆమెను జగదేవిపేట ఆస్పత్రిలో చేర్పించారు.

## జనవాణి

2వ పేజీ కొరవ

వెలికితీత కార్యక్రమంలో వేలు పెట్టకుండా సహకరిస్తున్నందుకు వారిని అభినందిస్తున్నాను.

తూపిలి వనమాలి హైదరాబాద్

### నేదురుమల్లి కోలుకోవాలి!

నేదురుమల్లి జనార్ధనరెడ్డి ఇటీవల అస్వస్థులైనట్లు మీడియాలో వార్తలు వస్తున్నాయి. జనార్ధనరెడ్డి సీనియర్ కాంగ్రెస్ వాది. ఆయనలా ఒకే పార్టీలో ఉన్న వ్యక్తి వేరొకరు లేరు. ఇందిరాగాంధీ ప్రత్యేకంగా కాంగ్రెస్ పార్టీ ఏర్పాటు చేసుకొన్న సందర్భంగా ఆంధ్రా నుంచి అండగా నిలచిన వ్యక్తి ఆయనే. ఆయన మరికొన్నేళ్లు రాష్ట్ర ముఖ్యమంత్రిగా పని చేసి వుంటే జిల్లాలోని సమస్యలన్నీ తీరిపోయేవి. ఆయన ఆ సమయంలో ఎటువంటి అవినీతికి పాల్పడకపోయినా గోబెల్స్ ప్రచారాన్ని తట్టుకోలేక ఆ పదవికి రాజీనామా చేశారు. ఆయన త్వరగా కోలుకొని మళ్లీ రాజకీయాల్లో చురుకైన పాత్ర పోషించాలని మనసారా కోరుకొంటున్నాను.

వై.వి.రామానుజస్వామి నెల్లూరు

### వెంపటి చినసత్యంకు నివాళి!

కూచిపూడి నృత్యానికి అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చిపెట్టిన వెంపటి చినసత్యంకు, కావలి విశ్వోదయకు వున్న సాన్నిహిత్యం దృష్ట్యా దివంగత భుజంగరాయశర్మ రచించిన 'చండాలిక' తొలి ప్రదర్శన కావలిలోనే వేశారు. గతంలో విశ్వోదయలో లలితకళలకు, సంగీత నాట్యాలకు పెద్దపీట వేసి ఆ కళలను బోధించేవారు. ద్వారం భావ నారాయణ రావు, భాగవతుల రామతారకం ఎందరికో కావలిలోనే శిక్షణ ఇచ్చారు. కావలి విశ్వోదయకు వెంపటి చినసత్యంకు ఉన్న సంబంధం దృష్ట్యా ఇక్కడ కూచిపూడి సంగీత నాట్య శిక్షణాలయం ఏర్పాటు చేస్తే బాగుంటుంది.

కె.సుజాత కావలి

## పదరంగం -32

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | | 3 | 4 | | 5 | | |
| | | 6 | | 7 | | | | | | |
| 8 | | | | 9 | | | | | 10 | |
| | | 11 | | | | | | 12 | | |
| | 13 | | | 14 | | | | | 15 | |
| 16 | | 17 | | | | | | | | |
| | | | | | | 18 | 19 | 20 | | 21 |
| | 22 | | | | | | 23 | | | |
| 24 | | | | | 25 | 26 | | | | |
| | | 27 | | | 28 | | | | | |
| | | 29 | | | | | | | | 30 |

**అడ్డం**

1. మెరుపు తీగ (4)
3. చిక్కని పదార్థము (2)
5. పెనిమిటి (3)
6. ఇంగ్లీషు ఈర్ష (3)
8. సర్పరాజు (3)
9. సంపూర్ణ శారీరక చికిత్స (7)
11. కొబ్బరికాయ (3)
12. ... మ్రింగిన వెలగ పండు (2)
14. చీపుళ్లు (4)
15. కృష్ణుడ్ని ముద్దుగా ఇలా పిలుస్తారు (2)
16. గ్లో, ప్రకాశం (3)
18. వాహ్వా.... (3)
22. నీచుడు (4)
23. జనపనార తాడు (4)
24. అవసరం (3)
26. అటు నుంచి మత్స్యం (2)
27. దాసన్న - చెదిరి పోయాడు (3)
28. శివుడు (4)
29. మినప్పిండి, నెయ్యి చక్కెరల వుండ (3)
30. వరస మారిన సూప్ (3)

**నిలువు**

1. గంజి అన్నం (4)
2. శిరస్సు (2)
4. నేత్రవ్యాధి (5)
5. ఎండ మావి (4)
7. తలంటు పొడి (5)
10. ఇబ్బంది 'కిరి'తో (4)
11. క్రింద నుంచి మొట్టికాయ (4)
13. రథం (2)
16. మృగం (2)
17. ఈయన కీర్తనలు ప్రసిద్ధాలు (6)
19. టుమారో (2)
20. స్త్రీలు (5)
21. ఫినిషింగ్ టచ్ (5)
22. మాదన్న తోటి వాడు (3)
24. అసత్యం (3)
25. వర్క్ (2)

**సమాధానాలు**

## పదరంగం -31

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| [1]ఆ | | [2]ఆ | న | | [3]అ | [4]త | [5]లా | [6]కు | త | [7]లం |
| [8]ట | ము | కు | | | [9]పూ | ట్ట | ల | బు | | ఖ |
| వి | | [10]అ | పు | రూ | ప | | | [11]సం | [12]ధా | నం |
| [13]కు | చ | ల | | | [14]ము | ది | త | | ర | |
| లు | | [15]ము | లు | కు | లు | | | [16]గ | ణ | న |
| | [17]చ | లు | వ | | | [18]మో | దం | | శ | |
| [19]శు | ద్ధి | | | [20]గ | [21]వా | క్షం | | [22]వ్య | క్తి | [23]త్వం |
| భ | | [24]ర | మా | ర | మి | | [25]చి | తి | | త |
| [26]క | రు | ణ | | ళం | | [27]ఉ | త్త | రే | ణి | |
| రం | | [28]రం | [29]గ | | [30]డ | మ | రు | కం | | [31]వ |
| | [32]సు | గం | ధ | ము | | | వు | | [33]అ | ల |

# సంక్షిప్త సింహపురి

## దొంగతనాలు జరుగకుండా టాస్క్‌ఫోర్స్

నెల్లూరు నగరంలో విచ్చలవిడి దొంగతనాలతో ప్రజలు భయాందోళనకు గురవుతున్నారని, వీటిని నివారించేందుకు ప్రత్యేక సిబ్బందితో టాస్క్‌ఫోర్స్ ఏర్పాటు చేయాలని తెలుగుదేశంపార్టీ నాయకుడు కోటంరెడ్డి శ్రీనివాసులరెడ్డి ఎస్పీ బి.వి.రమణకుమార్‌ను కలసి విజ్ఞప్తి చేశారు. నగరంలో వరుస దొంగతనాలు జరుగుతున్నా సంబంధిత పోలీస్‌స్టేషన్ సిబ్బంది పట్టించుకోవడంలేదని, దీనివల్ల ఇళ్లలో నుంచి బయటకు రావాలంటే మహిళలు దడచుకొంటున్నారని మెడలోని బంగారు సరుడు తీసి పసుపుతాడు వేసుకొని బయటకు వస్తున్నారన్నారు. ఏ సమయంలో ఏ ఇంట్లో దొంగలు చొరబడి దొంగతనాలకు పాల్పడతారోనని ప్రజలు భయంతో బిక్కుబిక్కుమంటున్నారని ఈ భయాన్ని పోగొట్టవలసిన అవసరం పోలీసులపై ఉందన్నారు. అన్ని ప్రాంతాల్లో మైత్రీ సంఘాలు ఏర్పాటు చేస్తే పరిస్థితుల్లో మార్పులొస్తాయన్న ఆశాభావాన్ని కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి వ్యక్తం చేశారు.

## చేపల మార్కెట్‌లో అదనపు ప్లాట్ ఫారాలు!



నెల్లూరు డైకస్‌రోడ్డులోని జలపుష్పభవన్‌లో చేపలు శుభ్రం చేసే వారికి అదనపు ప్లాట్ ఫారాలు నిర్మించి ఇవ్వాలని చేపలు, రొయ్యల వ్యాపారుల సంక్షేమ సంఘం మత్స్యశాఖామంత్రి విశ్వరూప్‌కు వినతి పత్రం ఇచ్చింది. మంత్రి ఇటీవల ఈ మార్కెట్‌ను సందర్శించారు. మార్కెట్‌లో చేపలు శుభ్రం చేసే వారు 130 మంది వుంటే 62 ప్లాట్‌ఫారాలు మాత్రమే వున్నాయి. దీంతో ఆరుబయట సరైన వసతులు లేనిచోట ఈ కార్యక్రమం పూర్తి చేయాల్సి వస్తుందన్నారు. చేపల మార్కెట్‌లో హోల్‌సేల్ వ్యాపారులు తూకం సరిగ్గా వేసి ఇవ్వకపోవడం వల్ల రిటైల్ వ్యాపారం చేసేవాళ్లు ఇబ్బందులు పడుతున్నారని, మార్కెట్‌లో వ్యర్థాలు చేపలు శుభ్రపరిచే కార్మికులకు ఇవ్వాలని సంక్షేమ సంఘం మంత్రికి విన్నవించింది.

## రంగడి పవిత్రోత్సవాలు!

నెల్లూరీయుల ఆరాధ్యదైవం తల్పగిరి రంగనాథస్వామి దేవస్థానంలో పవిత్రోత్సవాలు ప్రధాన అర్చకులు జగన్నాధాచార్యుల పర్యవేక్షణలో వేదోక్తంగా శాస్త్రోక్తంగా జరిగాయి. 31వతేది వరకు ప్రతిరోజు సాయంత్రం తిరుమంజనం, మహాకుంభారాధన, ఆదివాసం, పవిత్ర సమర్పణ, మండలారాధన జరిగాయి. ఈ ఉత్సవాలకు పెద్దసంఖ్యలో భక్తులు హాజరయ్యారు.

## జీతం సక్రమంగా ఇవ్వండి!

అపరిష్కృతంగా ఉన్న తమ సమస్యలు పరిష్కరించాలని మునిసిపల్ పారిశుధ్య కార్మికులు సిఐటియూ ఆధ్వర్యంలో కార్పొరేషన్ కార్యాలయం ఎదుట ధర్నా నిర్వహించారు. ఈ సందర్భంగా మునిసిపల్ వర్కర్స్ అండ్ ఎంప్లాయిస్ యూనియన్ అధ్యక్షుడు పి ఆనందకుమార్ మాట్లాడుతూ కార్పొరేషన్ పారిశుధ్య విభాగంలో పని చేస్తున్న సొసైటీ, కాంట్రాక్ట్ కార్మికులకు కనీస వేతనం 10వేల రూపాయలు తక్కువ కాకుండా ఇవ్వాలన్నారు. నెలవారీ జీతాలను సక్రమంగా చెల్లించాలన్నారు. వారాంతపు సెలవులను మంజూరు చేయాలని కోరారు. పెండింగ్‌లో వున్న పి.ఎఫ్ డబ్బులను కార్మికుల ఖాతాలో వెంటనే జమ చేయాలన్నారు. అనంతరం ఈ సమస్యలపై కమిషనర్ టిఎస్ఆర్ ఆంజనేయులకు వినతి పత్రం ఇచ్చారు. శ్రామిక మహిళ నగర కన్వీనర్ షేక్ మస్తాన్‌బీ కూడా ఈ నిరసన కార్యక్రమంలో భాగం పంచుకొన్నారు.

## కోటంరెడ్డి వినూత్న నిరసన!



కరెంటు కోతలను నిరసిస్తూ వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి నేతృత్వంలో 29తేది నెల్లూరులో విద్యుత్ ఎస్ఇ కార్యాలయం ముందు వినూత్న ధర్నా నిర్వహించారు. బల్బులు, ఫ్యాన్లు, విద్యుత్ మోటార్లు, కరెంట్ తీగలు, కొవ్వొత్తులను చేతపట్టుకొని విసనకర్రలను ఊపారు. వద్దువద్దు చీకటి రాజ్యం... ఏ పాపం చేశామని ఈ కరెంట్ శాపం... కరెంట్ ఇవ్వలేని కాంగ్రెస్ నీకెందుకు పవర్... డౌన్‌డౌన్ సిఎం అంటూ నినదించారు. అనంతరం ధర్నాను ఉద్దేశించి కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ దివంగత రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా ఉండగా కరెంట్ కష్టాలు లేవని, కరెంట్ ఇబ్బందులను ముందే ఊహించి ఇతర రాష్ట్రాల నుంచి కరెంట్ కొని ఇబ్బందులు లేకుండా చూసేవారని, ఇప్పటి కాంగ్రెస్ ప్రభుత్వానికి ముందుచూపు లేకపోవడం వల్ల ప్రజలు కరెంట్ కష్టాలు పడాల్సి వస్తుందని దుయ్యబట్టారు. అనంతరం విద్యుత్‌శాఖాధికారులకు వినతిపత్రం సమర్పించారు. ధర్నాలో కెవి.రాఘవరెడ్డి, పిగిలం సురేష్, తాటి వెంకటేశ్వర్లు, బిరదవోలు, శ్రీకాంత్ రెడ్డి, మందా బాబ్జి తదితరులు పాల్గొన్నారు.

## 12 నుంచి నివాసిత గుర్తింపు కార్డుల సర్వే

జిల్లావ్యాప్తంగా నివాసిత గుర్తింపు కార్డుల జారీ సర్వే కార్యక్రమం ఈ నెల 12 నుంచి ప్రారంభం కానుంది. ఈ కార్యక్రమాన్ని జిల్లా ప్రణాళిక శాఖ ఆధ్వర్యంలో నిర్వహిస్తారు. ఉపాధ్యాయులు గ్రామీణ ప్రాంతాల్లో ఇంటింటా సర్వే నిర్వహించి నిర్ణీత దరఖాస్తు ఫారంను కుటుంబ యజమానికి అందజేస్తారు. కుటుంబ యజమాని పూర్తి సమాచారాన్ని దరఖాస్తులో పొందుపరిచి సమీపంలో ఏర్పాటుచేసిన బయోమెట్రిక్ కేంద్రానికి తీసుకెళ్లి అందజేయాలి. ఈ కేంద్రంలో కనుపాపల ఫోటోలు తీస్తారు. ఇప్పటికే ఆధార్ కార్డు కలిగి వున్న వారికి నివాసిత గుర్తింపు కార్డును మాత్రమే జారీ చేస్తారు. ఆధార్ కార్డు పొందని వారికి రెండు కార్డులను అందజేస్తారు. కార్యక్రమాన్ని ఎటువంటి లోపాలు లేకుండా నిర్వహించాలని అధికారులు నిర్ణయించారు. జిల్లాలో 46 మండలాల్లో నివాసిత గుర్తింపు కార్డుల జారీ కార్యక్రమాన్ని త్వరితగతిన పూర్తి చేయనున్నారు. సర్వే కార్యక్రమానికి నియమించిన ఉపాధ్యాయుల పనితీరును గణాంక శాఖ అధికారులతోపాటు మండల తహశీల్దార్లు పర్యవేక్షిస్తారు.



రైతు లోకం

## వరిలో దోమపోటు - నివారణ చర్యలు!

ప్రస్తుతం వరిపైరు ఈనిక దశ నుంచి గింజ గట్టిపడే దశ వరకు వున్న పొలాల్లో అక్కడక్కడా దోమపోటు వున్నట్లు గుర్తించడమైనది. గోధుమ రంగు లేదా తెల్లవీపు దోమ రెక్కలున్న తల్లి పురుగులు, రెక్కలు లేని పిల్ల పురుగులు వరి మొక్కల మొదళ్ల దగ్గర గుంపులుగా చేరి రసం పీల్చడం వల్ల పైరు లేత పసుపు రంగులోకి మార్పు చెంది క్రమంగా సుడులు సుడులుగా ఎండిపోతుంది. పైరు ఎండిపోయిన దగ్గర దోమలుండవు. రెక్కలు వచ్చి గెంతుతూ పచ్చగావున్న పైరు వైపు వలసపోయి అక్కడి పైరును నష్టపరుస్తాయి. పొలంలో దిగి మొదళ్ల దగ్గర వున్న దోమను గుర్తించాలి. విచక్షణా రహితంగా పురుగు మందులు పిచికారీ చేయరాదు. ఈనిక దశ నుంచి గింజ పాలు పోసుకొనే దశలో దుబ్బుకి 20 నుంచి 25 దోమలు వున్నట్లు గమనించి నట్లయితే మోనోక్రోటోఫాస్ 2.2 మిల్లీలీటరు, డైక్లోరోవాస్ 1 మిల్లీలీటరు లేదా ఎసిఫేట్ 1.5 గ్రాములు, డైక్లోరోవాస్ 1 మిల్లీలీటరు, లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయాలి. ఉధృతి ఎక్కువగా వున్నట్లయితే వారం రోజుల్లో మందు మార్చి మరొకసారి పిచికారీ చేయాలి.

వరిపైరు కోతకు దగ్గరగా వచ్చినప్పుడు అంటే గింజ గట్టిపడినప్పుడు దోమ వల్ల నష్టం జరగదు. కావున రైతు సోదరులు కోతకు 10 నుంచి 15 రోజులు పట్టేదశలో పురుగు మందులు పిచికారీ చేయనవసరం లేదు. పవర్ స్ప్రేయర్‌తో పిచికారీ చేసేటప్పుడు ఎకరాకు 7-8 ట్యాంకుల మందునీరు సరిపోతుంది. J

## రక్తపు వ్యాపారంతో

# దెయ్యాల కొంపలా మారిన పెద్దాస్పత్రి!

మానవత్వానికి, మానవత్వ రాహిత్యానికి కూడా నెత్తురు ఒక సంకేతం. నెత్తురోడ్చి పనిచేసే వాడికి సమాజంలో ఉన్నత స్థానం లభిస్తుంది. నెత్తురు పీల్చే దుర్మార్గుడికి సమాజంలో నీచ స్థానం దక్కుతుంది. రోగి శరీరాన్ని కోసి, రక్తంలో చేతులు పెట్టి, వైద్యం చేసే డాక్టర్ దేముడితో సమానం. శత్రువు శరీరాన్ని కత్తులతో పొడిచి, చేతులకు రక్తపు మరక అంటించుకొన్న వాడు దానవుడు.

దేముళ్ల వంటి డాక్టర్ల నిలయంగా భాసిల్లవలసిన పెద్దాసుపత్రిలో జరుగుతున్న రక్తపు వ్యాపారాన్ని చూస్తేనే అదొక దెయ్యాల కొంపగా మారిపోయిందన్న ఆవేదన కల్గుతున్నది. మొన్న 2వ తేది ఆదివారం రాత్రి పదిన్నర సమయంలో నలుగురు యువకులు మోటారు సైకిళ్ల మీద బ్యాగులు తగిలించుకొని, అనుమానాస్పదంగా కన్పించారట. ఇటీవల నెల్లూరు టౌన్‌లో దొంగతనాలు పెరిగి పోవడంతో తెలుగుదేశం నాయకుడు కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి తన అనుచరులతో మైత్రీ సంఘాలను ఏర్పాటుచేసి బాలాజీనగర్ పరిసరాలలో పహారా కాయిస్తున్నాడు. ఆ మైత్రీ సంఘానికి సంబంధించిన ఆకుల హనుమంతరావు అనే యువకుడికి ఈ



పెద్దాస్పత్రి వద్ద ఆందోళన చేస్తున్న తెలుగుదేశం పార్టీ నగరాధ్యక్షుడు కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి, చిరంజీవి అభిమాన సంఘాల నేతలు.

మోటారు సైకిళ్ల మీద ఉన్న వారి మీద సందేహం కల్గింది. వారిని ఆపి మీరెవరని ప్రశ్నించేసరికి వారు భయపడి వేగంగా వెళ్లి పోయారట. దానితో అనుమానం బలపడి అక్కడున్న వారందరూ కలిసి వారిని వెంటబడి తరిమారు. మినీబైపాస్ రోడ్డు మీద సాయిబాబా మందిరం సమీపంలో ఆ మోటారు సైకిళ్లు జారి పడ్డాయి. వెంట వచ్చిన వారిని వాటి మీద వెళ్తున్న ఇద్దరినీ అదుపులోకి తీసుకొని, బ్యాగులలో ఏమి ఉందో చూశారు. వాటిలో పెద్దాసుపత్రి గుర్తుతో ఉన్న 69 రక్తపు సంచులు దొరికాయి. వాటిని చూసి అక్కడ గుమికూడిన జనం కళ్లు తిరిగాయి. ఇవి మీకెక్కడివి అంటే పెద్దాస్పత్రి నుంచి తీసుకొని ఒంగోలులోని ప్రైవేటు ఆస్పత్రులకు అమ్మడానికి వెళ్తున్నామని ఒప్పుకొన్నారట వారు. అక్కడ దొరికిన ఇద్దరిలో ప్రదీప్ అనే వ్యక్తి గతంలో హైదరాబాదులోని నిమ్స్ ఆస్పత్రిలో పనిచేస్తూ, రక్తపు సంచులను అక్రమంగా విక్రయించే నేరం మీద పట్టుబడి ఉద్యోగం పోగొట్టుకొన్నాడట. అది ఎంత వరకు నిజమో తెలియదు.

తెలుగుదేశం నాయకుడు కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి ఆ ఇద్దరినీ పోలీసుకు స్వాధీనం చేసి, దొరికిన రక్తపు సంచులను పెద్దాసుపత్రి బ్లడ్ బ్యాంక్‌కు తీసుకవెళ్లి అప్పచెప్పాడట. అక్కడి సిబ్బంది వాటిని పరిశీలించి, లోపల దాచే సమయానికి అర్థరాత్రి దాటి ఒకటిన్నర అయ్యింది. పోలీస్ అధికారులు కూడా అక్కడే ఉన్నారు. విచిత్రంగా ఆ సమయానికి మాజీ మేయర్ భానుశ్రీ సోదరుడు రవిరాజు అక్కడకు వచ్చాడట. పోలీస్ అధికారులతో ఏదో మాట్లాడడానికి ప్రయత్నించాడట. కానీ పెద్ద సంఖ్యలో ఉన్న తెలుగుదేశం కార్యకర్తలు భానుశ్రీ తమ్ముడిని తరుముకొన్నారు. నీకిక్కడ ఏమి పని అని నిలదీశారు. దానితో స్థానిక సర్కిల్ ఇన్‌స్పెక్టర్ అతడిని గుంపు నుంచి తప్పించి, బయటకు పంపేశాడట.

పక్కరోజు దీనిపై తెలుగుదేశం కార్యకర్తలు, చిరంజీవి అభిమానులు పెద్దాసుపత్రి ఎదుట ధర్నా జరిపారు. ఆస్పత్రి బ్లడ్ బ్యాంక్ నిర్వాహకుడు డాక్టర్ క్రిష్ణమూర్తి తెలుగుదేశం కార్యకర్తలు అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పలేక పోయాడు. ఆయనకు మంచి పేరు ఉంది. కానీ ఏ కారణం వల్లనో ఈ విషయంలో తడబాటు పడ్డాడు.

నెల్లూరులో చాలాకాలంగా ఏ ఆస్పత్రికి రక్తం కావలసినా రెడ్ క్రాస్ బ్లడ్ బ్యాంక్ ఆదుకొంటూ ఉండేది. అక్కడ ఆధునిక సౌకర్యాలు, పరికరాలు



పెద్దాస్పత్రి బ్లడ్ బ్యాంక్ ఇన్‌ఛార్జి డాక్టర్ కృష్ణమూర్తిని విచారిస్తున్న డ్వామా పిడి గౌతమి, పెద్దాస్పత్రుల సమన్వయకర్త డాక్టర్ నిర్మలమ్మ.

ఉండడమే కాదు, నిర్వహణ సైతం శాస్త్రీయంగా జరిగేది. కానీ దురదృష్ట వశాత్తు ఒక మహిళా రోగికి ఇచ్చిన రక్తంలో హెచ్ఐవి వైరస్ ఉందని తేలడంతో అందరూ కలిసి ఆ సంస్థ ప్రతిష్టను మంట కలిపారు. మూడు నాలుగు లక్షల రక్తపు సంచులలో ఒకటి లేదా రెండు చోట్ల ఇటువంటి పొరపాటు జరగడం సాధారణమే అని, హెచ్ఐవి వైరస్ విండో పీరియడ్‌లో ఉన్నప్పుడు ఏ పరీక్షలోనూ బయట పడదని, అందులో బ్లడ్‌బ్యాంక్ చేయగల్గింది ఏదీ లేదని చాలా మంది నిపుణులు వివరణ ఇచ్చినా రెడ్‌క్రాస్ మీద శతృత్వంతో దాన్నొక ఆగంగా మార్చారు కొందరు ప్రబుద్ధులు. అందువల్ల ఈ మధ్య రక్తదానం చేసే వారు రెడ్‌క్రాస్‌కు బదులుగా పెద్దాసుపత్రికి వెళ్లి ఇస్తున్నారు. మొన్న జరిగిన చిరంజీవి జన్మదినోత్సవంలో ఆయన అభిమానులు దాదాపు రెండున్నర వేల మంది రక్త దానం చేశారు. ఆ సంఘటన గిన్నీస్ బుక్ ఆఫ్ రికార్డుకు కూడా ఎక్కింది.

రెడ్‌క్రాస్ సేవా కార్యక్రమాలు నిలిచి పోవడం వల్ల నెల్లూరులో రక్తానికి ఎక్కడలేని గిరాకీ వచ్చింది. ప్రైవేట్ ఆసుపత్రుల వారు ఒక్కొక్క రక్తపు సంచికి రెండు నుంచి మూడు వందల రూపాయల ధర చెల్లిస్తున్నారట. దానితో అక్రమార్కుల కళ్లు ఈ వ్యాపారం మీద పడ్డాయి. పెద్దాస్పత్రిలో వూహించని స్థాయిలో రక్తపు నిల్వ ఉండడం వల్ల దాన్ని వక్రమార్గంలో తరలించి, పెద్ద మొత్తంలో సొమ్ము చేసుకొనే ముఠా ఒకటి తయారైనట్లు కన్పడుతున్నది. ఆ ముఠాలోని సభ్యులే ఇప్పుడు దొరికారు.

పెద్దాస్పత్రిలో రక్తం విడుదల చేయడానికి

కొరవ 14వ పేజీలో






Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com